## అధ్యాయం 5

# మానవుడు - జీవితం

మానవజీవితపు లోతులు, రహస్యాలు, ఆశలు, నిరాశలు, సంఘర్షణలు, సమాధానాలు అన్నీకూడ ప్రాచీన మెసొపొటేమియా సారస్వతంలో సముచితంగా ప్రతిబింబించినట్లు చెప్పడానికి చాలా దాఖలాలు ఉన్నాయి. ఈ బాపతు వాఙ్మయంలో చాలాభాగం రాజుల, రారాజుల దండయాత్రలకు సంబంధించిన ప్రశంసల పుట్ట. ఇందులో ప్రౌఢనిర్భరమైన పదాడంబర పటాటోపం చాలా హెచ్చు. వాస్తవ వర్ణనలకంటె అసంగతమైన అతిశయోక్తులకు లేనిపోని ప్రాధాన్యం ఇచ్చినట్టు కనబడుతుంది. ఈనాడు మన దృష్టికి ఇలా కనిపించవచ్చు కాని, సాహిత్యచరిత్రరచనలో దీనికి ఒక ప్రత్యేకస్థానం ఉంది. ఇట్టి రచనల ప్రయోజనం కేవలం తాత్కాలిక మయినదేకావచ్చు. అయినప్పటికీ ఈ విధంగా ఇచ్చకాలు చెప్పి ఇంద్రుడు, చంద్రుడు అని పొగిడి, ప్రభువుల ప్రాపకం సంపాదించడానికి పద్యరత్నాలు వ్రాసి బ్రతుకవలసిన ప్రాసమాత్రజీవులకు ప్రాచీనకాలంలోనే ప్రోత్సాహం ఉండేదని; యమకం, గమకం కలిగిన పరిశుద్ధ పద్యరచనతో

పాటు రచనాశిల్పం తెలిసిన సమర్థులైన కవులుకూడ ఉండే వారని చెప్పడానికి ఇవినిదర్శనంగా ఉపకరిస్తాయి. అస్సీరియాను క్రీస్తుపూర్వం పదకొండునందల పదిహేను నుంచి పదకొండు వందల రెండువరకు పరిపాలించిన టిగ్లాక్ పాలేనర్ స్మృతి చిహ్నంగా వ్రాయించిన శాసనాన్ని ఇట్టి రచనకు తార్కాణంగా పేర్కొనవచ్చు.

ఈ శాసనం ధోరణి చూడండి, ఎలా ఉందో! "సకలభువన పరిపాలక, రాజ, రాజరాజ, మహారాజ, వీరాధి వీర, చతుర్దేశ, మహాప్రభు, నిఖిల రాజన్యమాళి, షమాష దేవ ప్రసాదిత జగద్గురు బిరుదాంక విరాజిత, వీరమార్తాండ, సర్వదేశ ప్రజా సార్వభౌమ, అసూర్ కరుణాకటాక్ష ప్రసార వీక్షక, సర్వన్యాయాధీశ, దూర దిగంత సీమావధి విజేత, దుష్టశిక్షణ శిష్టరక్షణ దీక్షాదక్ష, దక్షా అధ్యక్షాది బిరుద విరాజమానుడైన విద్యుత్ప రేశ మహారాజులుంగారు" ఈ ధోరణిలో సాగిన శాసనకవిత మనకీనాడు పరిహాస భాజనంగా కనుపించవచ్చు గాక. కాని నిజానికి ఈ విషయంలో మనవారు ఏమీ తక్కువ తిన్నవారు కారు. ఆంధ్ర సాహిత్యంలో నన్నయ్యకు ముందునాటి శాసన వాఙ్మయం. నన్నయ్య భారతంనుంచి ఈనాటివరకు వెలసిన తెలుగు ప్రబంధాలు, కావ్యాల అవతారికలూ, కృతిపతి వర్ణనలూ ఇందుకు ప్రత్యక్షసాక్ష్యాలు. మామూలు మానవులను పట్టుకొని ఇంద్రుడు, చంద్రుడు అంటూ ఆకాశానికి ఎత్తివేస్తూ వందిమాగధ స్తోత్రాలు చదవడం దాదాపు పదేళ్ళక్రిందటి వరకుకూడ స్వదేశ సంస్థానాలలో, జమీందారీ దివాణాలలో

పరిపాటిగా ఉండేది. ఈ విధమైన ముఖస్తుతి కార్యక్రమం అతి ప్రాచీనకాలంనుంచీ ఉండేదన్న మాటకు ఈ మెసొపొటేమియా శాసనాలు నిదర్శనం. అంతమాత్రాన ఈ శాసన వాఙ్మయం అంతా కేవలం రాజుల, రారాజుల గుణగణ ప్రశంసకే పరిమితమై పోయిందని భావించకూడదు. వీటిల్లో కొన్ని ప్రజల జీవన విధానాలను గురించి, ఆశయాలను గురించి, నడవడిని గురించి, శీల సంపదను గురించి ఎన్నో విశేషాలను తెలుసుకోడానికి వీలుగా వుంటాయి.

అక్కాద్ మొదటి సర్గాన్ అట్టాదేశపు రాజు. ఈయన క్రీస్తు పూర్వం 2872నుంచి2817 వరకు పరిపాలించాడు. ఈయన తన హయాంలో వాయవ్యంగా మధ్యధరా సముద్రం వరకు ఉన్న రాజ్యాలు అన్నింటినీ జయించి విజయ సూచకంగా తన ఆయుధాలకు అంటిన రుధిర ధారలను ఆగ్నేయాన ఉన్న పర్షియన్ సింధుశాఖలో ప్రక్షాళనచేసి చరిత్రలో తొలి మహా సామ్రాజ్యాన్ని నెలకొల్పిన పరాక్రమశాలి. అయితే ఈయన పుట్టుక నదీమూలం వలె తెలుసుకొనరానిది. నిరుపేదల ఇంటపుట్టాడు. ఈయన తల్లి దేవదాసి. వ్యభిచారమే వృత్తిగా గల నిత్యసువాసిని. తండ్రి ఎవరో తెలియనే తెలియదు. అలాంటి వాడు పెరిగి పెద్దయి స్వీయ ప్రతిభవల్ల ఒక మహా సామ్రాజ్యాన్ని నెలకొల్పాడు. ఇలా నెలకొల్ప గలగడం ఎంతటి మహత్తర సంఘటన! అయినప్పటికీ, అధికార మత్తుడై తానెట్టి పరిస్థితిలో పుట్టి పెరిగాడో ఏ మాత్రం మరచిపోకుండా వినమ్రతతోనే అధికార కిరీటాన్ని శౌదల దాల్చి ప్రజానురంజకంగా పరిపాలించాడు. తన మాట చెల్లు

తుంది గదా అనే అహంకారంతో తానేదో దైవాంశ సంభూతుడైనట్లు తప్పుడు చరిత్రను సృష్టించకుండా తనచరిత్రను అంతా ఉన్నది ఉన్నట్టు అరమరిక లేకుండా శిలాక్షరాలుగా చెక్కించి వేశాడు. ఎంతటి ధీరోదాత్త ప్రవృత్తి ఇది! "మా అమ్మ నిరుపేదరాలు. నికృష్టస్థితిలో వుండేది. మా తండ్రి ఎవరో నాకు తెలియదు. మా వూరు పేరు అజూబిరాము. యూఫ్రటిస్ నది ఒడ్డునవుంది. నేను ఎలాగో కడుపున పడ్డాను. నన్ను రహస్యంగా కన్నది. లోకాపవాదానికి వెరచి నన్ను ఒక గంపలో పెట్టి పైన తట్టబోర్లించి నదిలో వదలి వేసింది. దైవానుగ్రహంవల్ల నది నన్ను ముంచివేయలేదు సరికదా, అక్కి అనే సేద్యగాని చెంతకు చేర్చింది. అక్కి నన్ను బుట్టతో సహా బయటకుతీసి, నన్ను వరప్రసాదుడుగా భావించి, దైవ దత్తమైన బిడ్డగా పెంచుకున్నాడు."

ఈ గ్రంథాలన్నింటిలోను యుద్ధాల, జైత్రయాత్రల ప్రస్తావన చాలావుంది. ఈ ప్రాంతంలో ప్రతి పాళెగాడుకూడ సముద్రవేలావలయితమైన మహాసామ్రాజ్యాన్ని సంపాదించి పరిపాలించాలని కలలు కన్నట్టే కనబడుతుంది. అస్సీరియాను క్రీస్తుపూర్వం 858 నుంచి 824 వరకు పరిపాలించిన మూడవ షలమానేసర్ ఒక కావ్యంలో ఇలా వ్రాశాడు: "నేను రాజరికానికి వచ్చిన మొదటి సంవత్సరంలో బ్రహ్మాండమైన వరదతో పొంగుతున్నప్పుడు యూఫ్రటిస్ నదిని దాటాను. అస్తమితాదిత్య (మధ్యధరా) సముద్రతీరం వరకు జైత్రయాత్రచేసి శత్రు రుధిరధారలచే మలినమైన ఆయుధాలు అన్నింటినీ ఆ సముద్రంలో కడిగాం." మహా విజేతగా

అపూర్వ లక్ష్యసాధనకు సాధనంగా భగవంతుడు తన్ను సృజించి ఉంటాడని విజేతలు అందరివలెనే ఈయనా విశ్వసించాడు. అయితే విజేతల నొసట విధి వ్రాలు మరొకలా ఉంది అనుకోండి. అది వేరేవిషయం. తిగ్లత్ పాలేసర్ ఇలా వ్రాశాడు : "అసూర్ కరుణాకటాక్షంవల్ల, ఇతర దేవతల అనుగ్రహావిశేషంవల్ల నాకు మహాసామ్రాజ్యం లభించింది. వారు వరదానంచేసి మహాశక్తివంతుడవు కమ్మని ఆశీర్వదించి, అపారమైన శక్తియుక్తులను, ఆయుధాలను అనుగ్రహించి, ప్రతిపక్షవిదళనదక్షమైన "రణప్రభంజన" ఆయుధాన్ని అందించి తమ రాజ్యాన్ని నలుముఖాలా విస్తరింపచేయవలసిందని ఆదేశించారు. అప్రతిహతంగా పురోగమిస్తున్న తమ సైన్యాలకు ఏడుగడగా వుండడానికి తమ ఇష్టదైవం కలలోకనబడి వాగ్దానం చేశాడని మరికొందరు మహారాజులు వ్రాసుకున్నారు. అర్బిల్లాలోని మహాదేవాలయంలో మకాంచేసిన ఇష్టారు అస్సీరియాను క్రీస్తుపూర్వం 669 నుంచి 626 వరకు పరిపాలించిన అసూరు బనివాల్ కు దర్శనమిచ్చి కన్నతల్లివలె ఒడిలో పెట్టుకొని కాపాడుతానని, మణిహారంవలె పొత్తిళ్లలో పొదవుకుంటానని లాలిస్తుంది. సైనికులు అందరికీ కనబడి "నాచేతులారా సృజించి పెంచి పెద్దనుచేసిన అషూర్ బనివాల్ అవనీపతికి ముందుండి కేలూని నడిపించగల"నని విశదంచేసింది. క్రూరకర్మలకు వెనుదీయని అరిభయంకరులైన అస్సీరియాప్రజలు ఈ జైత్రయాత్రలలో కనివిని యెరుగని క్రౌర్యాన్ని ప్రదర్శించారు. ఏలం తన దండయాత్రను గురించి అషూర్ బనివాల్ స్వయంగా ఇలా చెప్పాడు:

జైత్రయాత్ర 55 రోజులుసాగింది. దండయాత్రసందర్భంలో ఎలంకుచెందిన మండలాలకి మండలాలనే సర్వనాశనం చేసి వేశాం. సస్యశ్యామలములైన, సారవంతములైన భూములు చౌడుదేరి పోయేటట్లు చేయడంకోసం ఉప్పుని, ముళ్ళకంపలని, కలుపు మొక్కలని వెదజల్లాం. హెలెన్‌లోని పవిత్ర దేవా లయాల నన్నింటినీ నామరూపాలు లేకుండా నేలమట్టం చేసేశాం. విగ్రహాలను ఊడబెరికి తుత్తునియలుచేసి బయట పారవేశాం. అన్యులకు దుర్గమములైన వారి వుద్యాన వనాలను మాసైనికులు భస్మీపటలంచేశారు. వారి పూర్వరాజులసమా ధులను పగలగొట్టి శవాలను పైకితీసి, నాశనం చేసేశాం. వారి అస్థికలను అస్సీరియాకు తీసుకువచ్చాం. వారికి తర్పణా దులు లేకుండాచేసి వారి ఆత్మలకు సైతం అశాంతిని కలిగిం చాం. మానవులను నోరెత్తకుండా చేసేశాం. ఎక్కడి జంతు వులను అక్కడే చంపించి, పంటచేలు అన్నింటినీ గాడిదలచేత మేపించివేశాం. ప్రజలమీదకు అసంఖ్యాకములైన అడవి మృగాలను ఉసికొల్పాం.''

ఇంతకు మించిన క్రౌర్యాన్ని ఊహించడం కష్టం. అస్సీరియాను క్రీస్తు పూర్వం 884 నుంచి 859 వరకు పరిపాలించిన మరొక మహారాజు అషూర్ న్నాసిరిపాల్ తన దండయాత్రలను గురించి ఇలా వ్రాసుకున్నాడు: "నా పరాక్రమంతో కుల పర్వతాలను సైతం దద్దరిల్ల చేశాను. వాటన్నింటినీ ఢీకొని కొండ కొమ్ములమీద నా బావుటాలను ఎగరవేశాను. అక్కడి ప్రజలను ఊచ కోతకోసినప్పుడు వారి రక్తధారలతో తడిసిన పర్వతం

పూర్తిగా పూచిన మోదుగవలె అరుణారుణమై పోయింది. ఆ సమయంలో పేరుకుపోయిన శిథిలాల మీదపేర్చిన మానవ కంకాళాలమీద నానీడ నిలచింది. యీ విధంగా కసితీర్చు కోవడంలో నాకుఅపూర్వమైన ఆనందం కలిగింది.” నినేవేలో దొరికిన శిల్ప శిథిలాలనుచూస్తే ఆనాటి దండయాత్రలు ఎంత ఉధృతంగా, ఎంత క్రూరంగా జరిగేవో, ఆనాటి పాలకుల సామ్రాజ్య పిపాస, రక్తదాహం ఎంతతీవ్రమైనవో అర్థ మౌతుంది.

కేవలం కష్టాలను ఎదుర్కొని వాటిని అధిగమించ డంలో కలిగే అసాధారణమైన ఆనందాన్ని పొందడంకోసమే కాక, తనలో గర్భితమైవున్న రక్తదాహాన్ని తీర్చుకోవడం కోసమే కాక వుద్యమాలను నిర్వహించ పూనుకొన్న వ్యక్తులు చరిత్రలో మనకు చాలా అరుదుగా కనబడుతారు. మొగలు సామ్రాజ్యాన్ని స్థాపించిన బాబరు చరిత్రగాని, రోమన్ సామ్రాజ్యాన్ని విస్తృతంచేసిన జూలియస్ సీజరుచరిత్ర గాని, అస్సీరియాను క్రీస్తుపూర్వం 722-705 ప్రాంతంలో పరిపాలించిన రెండవసార్గాన్ దండయాత్రలను గురించిగాని చదివినప్పుడు యీ సంగతి మనకు జ్ఞాపకం వస్తుంది. “అడ్డు లేకుండా పురోగమిస్తున్న మా సైన్యాలు ముందడుగు వేయ డానికి వీలులేకుండా ఒక మహాపర్వతం ప్రబలావరోధమై నిల్చింది. దాని శిఖరాగ్రం ఆకాశంఅంత ఎత్తునవుండి, ఆకాశానికే ఆధారంగా నిలిచినట్టుంది. ఇక దాని పాద పీఠం పాతాళం మధ్యవరకు వ్యాపించి వున్నట్టు కని పించింది. దానికి ఇరుపార్శ్వాల దుర్భేద్యమైన పర్వత

శ్రేణులు బహుదూరం వ్యాపించడంచేత ఎంత ప్రయత్నించినా ఎటు వెళ్ళడానికీ వీలు లేకపోయింది. దానిని ఎక్కడమూ కష్టమే, దిగడమూ కష్టమే. పైగా, ఆకాశం ఎత్తు శిఖరాలు. పాతాళంలోతు లోయలు. చూడగానే ఎంతటి ధైర్యశాలికైనా కళ్లు బైర్లు కమ్ముతాయి. భయంతో గుండెలవిసి పోతాయి. ఈ పరిస్థితులలో ఇయా అనుగ్రహం వల్ల నాకో ఆలోచన తట్టింది. దాంతో నిరాశతో కృంగి పోతున్న నాకు నూతన వుత్తేజం కలిగింది. నా సైన్యంలో పదాతులందరికీ కంచుతో చేసిన పలుగులు, గొడ్డళ్ళు ఇచ్చి కొండను పిండిచేయమని వుత్తర్వుచేశాను. అంతే! అచిర కాలంలో బండలు కొట్టి, కొండలు పిండిచేసి, ఒక చక్కని మార్గం ఏర్పర్చారు. రథాలు, గుఱ్ఱాలు, అంగరక్షకులతో సహా యావత్తు సైన్యానికి నేనే నాయకత్వం వహించాను. సాహసోపేతమైన డేగలవలె వీరు ఈ కొండనుంచి ఎగిరి వెళ్ళారు. ఆ తరువాత కార్మికదళం కొండదాటింది. వారి వెనుక బరువులు మోసే ఒంటెలు, కంచర గాడిదలు, అడవి మేకలవలె అంచులు, పంచలు దాటుకుంటూ ఆ పర్వతాగ్రాన్ని చేరుకున్నాయి. బరువైన ఆయుధాలతో, సాధన సంపత్తితో నా సైనికులు అందరూ ప్రమాదకరమైన పర్వత మార్గాలలో తడబడకుండా హాయిగా దిగేటట్టు చేశాను. మహోన్నతమైన ఈ పర్వతశిఖరాగ్రంపై శిబిరాన్ని ఏర్పరచుకొని అక్కడే బసచేశాను."

ఈ ప్రాచీన కావ్యాలద్వారా మనకు పరిచయమయ్యే మానవులు అందరూ క్రూరులు, కిరాతులు, రక్తపిపాసులు

నిత్య జీవితానుభవమే రచనావ్యాసంగానికి ప్రేరణ. కనుకనే ఆయా మహాకవుల రచనలలో మనకు వారివ్యక్తిత్వం, వారి అనుభూతులు, సంస్కారాలు అన్నీకూడా దండలో దారంవలె కనబడకుండా కనబడుతూనే ఉంటాయి. ఏదో ఒక దివ్యమైన, అనన్యమైన అనుభూతి, ప్రేరణ, సామరస్యం, తపన లేనిదే రసాత్మకమైన వాక్యసృష్టి జరుగదు. అది హార్దికమైనది. హృదయానుస్పంది. కాంతా సమ్మితత్వము దాని లక్షణము. ఏ దేశమేగినా, ఏ భాషచూచినా, ఏ కవిని పలుకరించినా కనబడేదీ, వినబడేదీ, అనుభవంలోకి వచ్చేదీ ఇదే. ఇది దేశకాలాల అవధులకు అతీతమైన కవితానుభూతి.

గడచిన పది వేల సంవత్సరాలలో మానవులు నాగరిక పథంలో, అభ్యుదయ మార్గంలో ఎంతో పురోగమించారు. అయితే ఈ పురోగమన యాత్ర అంతా సక్రమంగా నిర్నిరోధకంగా, అవ్యాహతంగా జరగలేదు. అడుగడుగునా ఎన్నెన్నో ఆటంకాలను ఎదుర్కోవలసివచ్చింది. ప్రకృతి ప్రపాతాలను ఎన్నింటినో తట్టుకోవలసి వచ్చింది. కాని ఈ కష్టాలన్నింటిని జయప్రదంగా ఎదుర్కొని, కాలవాహినికి అవసరమైతే ఎదురీది, కొట్టుకొని పోకుండా కాలూని నిలిచి మానవుడు క్రమంగా ప్రకృతి శక్తుల మర్మమెరిగి, ప్రకృతిపై ఆధిపత్యాన్ని నెలకొల్పుకోవడంలో కృతకృత్యుడయ్యాడు. అవుతున్నాడు. నిజమే సంతోషించదగిన సంగతే. ఈసంతోష సమయంలో జిజ్ఞాసువులందరినీ కలవరపెడుతున్నది ఇంకొకటి ఉంది. బాహ్య విశ్వంపై ఇంతటి విశేష విజయాన్ని చూరగొంటున్న మానవుడు ఆత్మావలోకన మొనరుచుకొని ఆగిన

రంగికమైన అరిషడ్వర్గాలను జయించగలిగాడా? తనలోని అల్పమానవుణ్ణి అదుపాజ్ఞలలో పెట్టగలిగాడా? తన స్వరూపాన్ని తెలుకోగలిగాడా? ఏమో! చెప్పగలిగిన వారెవ్వరు? ఔనని చెప్పడానికి నాకు ధైర్యం చాలదు. ఇంతవరకు తరతరాలుగా జిజ్ఞాసువులు సాగించిన తర్జనభర్జనల ఫలితంగా ప్రపంచపు నిజరూపం ఏమిటో తెలిసిందికాని తన రూపు తాను తెలుసుకోలేని, తెలుసుకోని విషాదపరిస్థితిలో పడిపోయాడు మానవుడు. గడచిన అయిదువేల సంవత్సరాలుగా తత్వవేత్తలందరూ మానవునికి స్వస్వరూప పరిజ్ఞానం కలిగించడానికే తలలు బద్దలుచేసుకొంటున్నారు. అయినప్పటికి ఈ ప్రధాన సమస్య ఈనాటికీ అపరిష్కృత సమస్యే. ఏమైనా ఒక్కసంగతి మాత్రం నిజం. తననూ, తనస్వభావాన్నీ పూర్తిగా తెలుసుకోనినాడు, ఈ విశాల విశ్వంలో తన సముచిత స్థానాన్ని గుర్తించి ప్రసన్న చిత్తంతో నిష్పక్షపాతంగా నిరహంకారంగా కృషిచేయనినాడు మానవుడు తాను వ్యక్తిగా, సమిష్టిగా ఎదుర్కోవలసి వచ్చిన, వస్తున్న, సమస్యలను సక్రమంగా, సర్వజన సమ్మతంగా పరిష్కరించజాలడనేది సత్యం.

భిన్నత్వం లోకధర్మమే అయినప్పటికీ మానవ సమైక్యాన్ని, మానవుని వసుధైక కుటుంబకత్వాన్ని చాటగల మహనీయ ధర్మాలు కొన్ని లేకపోలేదు. మానవుడు ఏదేశానికి ఏకాలానికి, ఏజాతికి చెందిన వాడైనప్పటికీ ఏరూపు వాడైనప్పటికీ మానవుడే. ఆలోచనాశక్తి, ఆవేదన, అనుభూతి అందరికీ సమానమే. నిర్మాణ కౌశలం, జిగీషేచ్ఛ,

జిజ్ఞాస, ఖేదము, మోదము అందరికి సమానమే. అందుచేతనే ఆయా పరిస్థితులలో ఆయా ప్రత్యేక సమస్యలను ఎదుర్కొని పరిష్కరించవలసి వచ్చినప్పుడు భిన్నభిన్న సమయాలలో, భిన్న భిన్న ప్రాంతాలలో నివసిస్తున్న మానవులు యించుమించు ఒకే విధమైనపద్ధతులను అవలంబించారన్న సంగతి, వారిఆలోచనల ధోరణులన్నీ ఇంచుమించు ఒకే విధంగా ఉన్నాయన్న సంగతీ, జీవితంఅంటే వారి అభిప్రాయాలు అన్నీ ఇంచుమించు ఒకటే ననీ విశ్వసాహిత్య దర్శిని సంపుటాలలో మనకుఅడుగడుగునా ద్యోతకమవుతూవుంటుంది. అయితే స్థానిక పరిస్థితులకు అనుగుణంగా స్వల్పమైన మార్పులు ఏవోకొన్ని ఉన్నప్పటికీ ప్రధాన సిద్ధాంతాలూ, విధానాలుమాత్రం ఒకటే. స్థానిక మైన స్వల్పమార్పులుండబట్టే ఆయా జాతుల జీవన విధానంలో, సమాజ నిర్మాణంలో, సంస్కృతిలో మార్పులు కానవస్తున్నాయి. ఇవన్నీకూడా మనకు ఆయా జాతుల సారస్వతంలో కొంతవరకైనా ప్రతిఫలిస్తూ ఉంటాయి.

ప్రస్తుతయుగం ప్రవీణులయుగం. ఈ ప్రవీణులంటే ఎవ్వరోకాదు. చాలా తక్కువ వాటినిగురించి చాలా ఎక్కువగా తెలిసిన పండితులు. ఏదో ఒక్క అభిమాన విషయాన్ని గురించి యావజ్జీవితమూ అందుకోసమే కృషిచేసి దాని పుట్టు పూర్వోత్తరాలన్నింటినీ పూర్తిగా తెలుసుకున్న వారు. ఇందువల్ల విడివిడిగా ఆయా విషయాలను గురించి సంపూర్ణ పరిజ్ఞానమైతే కలుగవచ్చును కాని జీవితంలో సమగ్రదృష్టి కొరవడి పోతుంది. మానవుడు మానవుడు కాకుండా ఏకవిషయ నిష్ణాతుడైన యంత్రంగా మారిపోయే ప్రమాదముంది.

అప్పుడు సృజనాత్మకమైన చైతన్య సంవిలసితమైన కృషి కుంటువడుతుంది.

ఈనాడు మానవునకు వినూత్నమైన శక్తి లభించింది. కొత్తగా కొత్తరకమైన రెక్కలువచ్చాయి. తన్ను ఇంతవరకు భూమికి కట్టి ఉంచిన శృంఖలాలను తెంచుకొని నిజంగానే విశ్వాంతరాళంలోకి పారిపోవడానికి అవకాశం లభించింది.

ఈనాడు మనం విశ్వాన్ని జయించుతున్నాం. కాని వైశాల్యాన్ని కోల్పోతున్నట్లనిపిస్తున్నది. అయితే అంత మాత్రాన దిగులుపడవలసిన పనిలేదు. ఆకాశపుటంచులు అందుకోగలిగి మానవమేధ గతకాలపులోతులు పరిశీలించి చరిత్రకు కొత్త అర్థం చెప్పుకుంటూ జీవితంయొక్క సమగ్ర సుందరరూపాన్ని అవగాహన చేసుకుంటేసరి. ముఖ్యంగా బాహ్యాభ్యంతర జీవితాల పాత కొత్తల మేలికలయికకు సుందరమూ, సుదృఢమూ, సుస్థిరమూ అయిన సేతువు సాహిత్య చరిత్ర.

ఈ విశ్వసాహిత్య దర్శిని పేరుకు మాత్రమే సాహిత్య దర్శిని. సాహిత్యంద్వారా కాంతా సమ్మితత్వ పద్ధతిలో మానవ నాగరికత సమగ్ర పరిణామాన్నీ, పురోగతినీ, పాఠకులకు పరిచయం చేయడమే మా అభిమతం. కనుక ఇది నిజానికి మానవనాగరికతా పరిణామదర్శిని. కనుకనే ప్రతీసంపుటి ప్రథమాధ్యాయంలోనూ, నేటి నాగరికతకు తాము నడవడికచే ఒరవడి దిద్దిన ప్రాచీన ప్రజల ఆచారవ్యవహారాలు, ఆర్థిక, రాజకీయ, సాంఘిక పరిస్థితులు, నిత్యజీవితంలో వారెదుర్కొ

నలసివచ్చిన సమస్యలు అన్నింటిని గురించి రేఖామాత్రంగా ప్రస్తావించాం.

ఇది విద్వాంసులకోసం, విమర్శకులకోసం, పండిత ప్రకాండులకోసం మాత్రమే వ్రాసిన పుస్తకంకాదు. కాల గర్భంలో కలిసిపోయిన అజ్ఞాత ప్రాచీన రచయితల కమనీయ కవితా ప్రాభవాన్ని చారిత్రక దృక్పథంతో సాహితీప్రియం భావుకులైన ప్రజలందరికీ పరిచయం చేయడానికి యథాశక్తి జరిగిన ప్రయత్నం ఇది. దీనిని ఈ రూపంలో అందచేయగల అపూర్వ అవకాశాన్ని అనుగ్రహించిన 'అన్న కృష్ణచైతన్య'కు ధన్యవాదాలు.

ఈ విశ్వసాహిత్య దర్శిని తెలుగు అనువాదాన్ని చదివి, ఆనందించి, ఉత్సాహంతో ఉపదేశించి, ఆదరాభిమాన పురస్సరంగా, ఆశీఃపూర్వకంగా మెరుగులు దిద్దిన విద్వద్వరేణ్యులు, శ్రీ యామిజాల పద్మనాభస్వామిగారికీ, శ్రీ జి.వి. సింగరాచార్యగారికీ నా నమోవాకాలు.

ఇంక ఇందులో పద్యభాగాలకు 'తేనెసోక నోరు తియ్యన అగురీతి' తమ రసనిష్యందిని గేయాలతో అపూర్వ కావ్యగౌరవాన్ని సంతరించిపెట్టిన అస్మత్ప్రియ మిత్రులు శ్రీ నండూరి రామమోహనరావుగారికి నా కృతజ్ఞతను ఎలా చెప్పాలో ఏమిటో భావావేశంలో తెలియడంలేదు.

**వేమరాజు భానుమూర్తి**

# అవతారిక

విశ్వసాహిత్యాన్ని గురించి, మానవ మహోదయానికి నిత్య నూతనమైన దోహదాన్ని, ఉత్తేజాన్ని కల్పించిన మహనీయ నాగరికతలను గురించి రేఖా మాత్రంగానైనా తెలియ జెప్పే గ్రంథాలను ప్రచురించవలసిన ఆవశ్యకాన్ని గురించి ప్రత్యేకంగా ప్రస్తావించ వలసిన పని లేదు. అందుకనే మలయాళ పాఠకుల నిమిత్తం రచించిన విశ్వసాహిత్య దర్శినిని తమ తమ భాషలలో ప్రచురించడానికి తమిళ, తెలుగు, కన్నడ ప్రచురణ కర్తలు ఎంతో ఉత్సాహంతో ముందుకు వచ్చారు.

విశ్వసాహిత్య దర్శిని శీర్షికలో ఇది తొలి సంపుటి. ఇందులో పశ్చిమాసియాలో అత్యంత ప్రాచీనతమమైన సుమేరియా, బాబిలోనియా, అస్సీరియా నాగరికతలనుగురించి సూచనప్రాయంగా పరిచయం చేయడానికి ప్రయత్నంజరిగింది. క్రీస్తుకు పూర్వం అయిదు వేల సంవత్సరాల నాడే సుమేరియా నాగరికత మహా ఉచ్ఛస్థాయికి చేరుకొంది. రెండవ సంపుటి క్రీస్తుపూర్వం నాలుగు వేల సంవత్సరాలనాడు వర్ధిల్లిన ప్రాచీన ఈజిప్టు నాగరికతను గురించినది. క్రీస్తుపూర్వం వేయి సంవత్స రాలనాడు ప్రారంభమై క్రీస్తు పూర్వం అయిదో శతాబ్దినాటికి

పరాకాష్ఠనందిన మహోజ్జ్వలమైన గ్రీకు నాగరికతా వికాస గాధ మూడో సంపుటికి ఇతివృత్తం.

ఈ విశ్వసాహిత్యదర్శినిని ఈ మూడు సంపుటాలకు మాత్రమే పరిమితం చేయడం మా అభిమతంకాదు. అయితే ప్రపంచ సాహిత్య సంపద అనల్పమైంది. మానవుని ఆయుర్దాయం అల్పమైంది. అందుచేత అందని పండ్లకు అర్రులు చాచడమెందుకని తరువాతి సంపుటుల సంగతి ప్రస్తావించడం మానివేశాం. కాని అచిరకాలంలోనే పాఠకులకు దేశదేశాల సాహిత్య సమీక్ష మిగతా సంపుటాలనుకూడా అందచేయ గలమనే మా ఆశ. అందుకే మా ప్రయత్నాలన్నీ.

మెసపటోమియా సాహిత్యసమాలోచనతో ప్రారంభమైన ఈ మొదటి సంపుటి భారతీయపాఠకుల అభిమానానికి ఆదరణకు పాత్రం కాగలదనే మా నమ్మకం. సుమేరియా ప్రజలకు, ఆర్యులకు పూర్వం భారతావనిలో నివసించినవారికి అత్యంత సన్నిహిత సంబధా లుండేవన్న సంగతిని ఇప్పుడు చరిత్రకారులు ఋజువు చేశారు. హరప్పాలో, మహెంజోదారోలో; బికనీర్‌లోని సరస్వతీ నదీ గర్భంలో దొరికిన ప్రాచీన నాగరికతా శిధిలావశేషాలను బట్టి, యావత్తు దక్షిణ భారతావనిలో ఆర్యులకు పూర్వం అమలులో ఉన్న నాగరికతలన్నీ ద్రావిడ సాంప్రదాయానికి చెందినవని మానుష శాస్త్రజ్ఞులు, పురాతత్వవేత్తలు, భాషా వేత్తలు ఏకగ్రీవంగా అభిప్రాయపడుతున్నారు. కాస్పియన్ సముద్ర పరిసర ప్రాంతాలలో ద్రావిడ నాగరికతా కేంద్రాలు ఉండేవని, వేదకాలం ప్రారంభంలోనే ఆర్య, ద్రావిడ సంస్కృతీ సమ్మేళనం

ఇరాన్‌లో ప్రారంభమయిందని ఆచార్య సునీతికుమార ఛటర్జీ అభిప్రాయపడ్డారు. ఆసియా మైనరులోని నైలికియా ద్రావిడ సంస్కృతికి నిలయమని చెప్పడానికి తగు నిదర్శనాలు ఉన్నాయి. అందుచేత ఇంతవరకు లభించిన ఆధారాలనుబట్టి ద్రావిడ సుమేరియా సంస్కృతులకు మధ్య అత్యంత సన్నిహిత సంబంధం ఉండేదన్నమాట నిర్వివాదం.

గ్రీసు దేశస్థుడైన ప్రిన్సు పీటరు మానవ శాస్త్రజ్ఞులలో సుప్రసిద్ధుడు. ఆయన మన గిరులలో నివసిస్తున్న తోడాల సంస్కృతిని గురించి విశేషమైన పరిశోధనలు చేసినవాడు. ఈ తోడాలు అనుసరిస్తున్న మతాచారాలు చాల వరకు సుమేరియా సంప్రదాయానికి చెందినవేనని, ఈనాటికీ 11 మంది సుమేరియా దేవతలను తోడాలు యథాతథంగా ఆరాధిస్తూనే ఉన్నారని ఆయన తన రచనలలో సోదాహరణంగా పేర్కొన్నాడు. సుమేరియాలో పురాతత్వ శాస్త్రజ్ఞులకు దొరికిన పాత్రలవంటి కంచు పాత్రలనే ఈనాటికీ తోడాలు ఉపయోగిస్తూ ఉండడం ఒక విశేషం. వీటన్నింటిని గురించి 1951 లో ప్రచురితమైన మద్రాసు ప్రభుత్వ చిత్రవస్తు ప్రదర్శనశాల పత్రికలో విపులమైన వ్యాసం ఒకటిఉంది.

ఈ విధమైన చారిత్రకాధారాలనుబట్టి మెసపటోమియా సాహిత్య సంగ్రహ సమీక్షపట్ల పాఠకుల ఆసక్తి పెరగడం సహజమే. అయితే మానవుడు ఎక్కడ ఎప్పుడు జన్మించినప్పటికీ ఒకే కుటుంబానికి చెందినవాడన్న సంగతిని మనం గుర్తుంచుకోవడం మంచిది. మున్ముందు ఈ విశ్వ సాహిత్య దర్శిని శీర్షిక క్రింద ప్రచురితం కాగల సంపుటాలలో మనకు ఎట్టి సంబంధం లేని క్రొత్తజాతుల ప్రజల నాగరికత

లను గురించి మనం తెలుసుకోగలుగుతాం. వారిజాతి, మన జాతి వేర్వేరువే అయినప్పటికీ వారి నాగరికతల సమీక్ష ఆసక్తి జనకంగా ఉండకపోదు.

ఇప్పుడే విశ్వసాహిత్య దర్శిని సంపుటాలను ప్రచురించడంలో మా ఆశయం సుందరమూ, సుస్థిరమూ, సుదృఢమూ అయిన అత్యంత సన్నిహిత సంబంధాలను సర్వమానవుల మధ్య నెలకొల్పడమే. మానవుడు ఏ దేశంలో పుట్టినా, ఏ మతాన్ని అవలంబించినా, ఏ జాతికి చెందినా మానవుడే. నేడు మొత్తం మానవకుటుంబమే సర్వనాశనమై పోయే ప్రమాద పరిస్థితి ఏర్పడింది. కాని ఈ గండాన్ని గడచి విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని నెలకొల్పుకొని జగత్కల్యాణ సంధాయకంగా మానవజాతి మనుగడ సుస్థిరం కావడానికి ఈ కృషి దోహదం కాగలదని మా విశ్వాసం.

అనువాదకులను గురించి ఒక మాట ఇక్కడ చెప్పక తప్పదు. దీనిని అనువదించిన శ్రీ వేమరాజు భానుమూర్తి గారు ఇప్పటికే అనేక ఉత్తమగ్రంథాలను రచించి, తెలుగు భాషకు అనన్యమైన సేవచేస్తున్నట్టివారు. అవధి ఎరుగని మహోత్సాహంతో నిత్య రచనా వ్యాసంగ మగ్నులైన శ్రీ భానుమూర్తిగారు ఇంత త్వరలో ఇంత సులభ సుందరమైన మనోహర శైలిలో దీనిని తెలుగు పాఠకులకు అందించినందుకు వారికి బహుధా కృతజ్ఞుణ్ణి. అలాగే ఆంగ్ల మూలంలో పొందుపరచిన పద్యాలకు తెలుగులో సమతుల్యములైన సులలిత సుమధుర వృత్తాలను రచించిన శ్రీ నండూరి రామమోహన రావుగారికికూడా కృతజ్ఞుణ్ణి.

"కృష్ణ చైతన్య"

చరిత్రకారుడైన హెరోడోటస్ గ్రంథాలు ఒక్కసారి తిరగ వేసి చూడండి. మీకే తెలుస్తుంది.

అయితే ఈ హెరోడోటస్ క్రీస్తు పూర్వం అయిదో శతాబ్దినాటివాడు. ఈయన పుట్టుకల నాటికే ఈ ప్రాంతంలో ప్రభవించి, పరిఢవిల్లిన నాగరికత పట్టుదప్పి పసలేనిదై పోయింది. ఇది ఎంత ప్రాచీనమైనదో తెలుసుకోవడానికో చిన్న ఉపాయముంది. మనకూ హెరోడోటస్‌కూ మధ్య ఇరవై అయిదు శతాబ్దుల అంతరముంది. అప్పటికప్పుడే చరిత్ర రచన ప్రారంభమై అయిదువేల సంవత్సరాలైంది. ఆ కాలపునాటి నాగరకత అని. గ్రీకులేమనకు చాల ప్రాచీనులు.అలాంటి ప్రాచీనులకు ప్రాచీనమైన తొలి నాగరికతను గురించి మనమిప్పుడు ముచ్చటించుకుంటున్నాం.

యూఫ్రెటిస్, టైగ్రిస్ నదుల మధ్యగల బహుసార వంతమైన మాగాణాన్ని ప్రాచీనకాలపు గ్రీక్ రచయితలు మెసపొటేమియాగా పేర్కొన్నారు. మెసపొటేమియాఅన్న మాటకు అర్థం నదుల నడిమినున్న దేశం అని. ఇప్పటి ఇరాక్ దేశమే ఈ మెసపొటేమియా. ఖచ్చితంగా చెప్పాలంటే ఈ రెండునదుల మధ్యనున్న లోయ ఉత్తర ప్రాంతమవుతుంది. కాని ఈనాడు మెసపొటేమియా అంటే ఈ లోయ దిగువ భాగం కూడా చేరిన యావత్తు దేశమూనని అర్థమవుతుంది. మా అభిప్రాయమున్నూ అదే. మెసపొటేమియా గతచరిత్ర బహుపురాతనమైనది. నాలుగుజాతుల ప్రజలు ఈ గడ్డమీద పుట్టి వర్ధిల్లి కాలగర్భంలో కలిసిపోయారు. టైగ్రిస్, యూఫ్రెటిస్ నదులు రెండూ కలిసి షటల్ ఆరబ్ అనే

పేరుతో ఒకే నదిగా కొంతదూరం ప్రవహించి చివరకు పర్షియాసింధుశాఖలో కలిసిపోయాయి. ఈ రెండునదుల సంగమ స్థలం నుంచి బయలుదేరి యూఫ్రెటిస్ నది ఒడ్డునే పడమటి దిశగా ప్రయాణం చేసినట్టయితే శిథిలావశిష్టములైన ప్రాచీన పట్టణాలు కొన్ని తగులుతాయి. అవి సుమేరియా పట్టణాలు. ఈ సుమేరియా యూఫ్రెటిస్ నదికి ఇరు వంకలా వ్యాపించిన సువిశాలదేశం. ఇచ్చటినుంచి కొంచెం దూరం ఎగువకువెళ్ళి వాయువ్యంగా తిరిగినట్లయితే బేబిలోనియాకు చేరుకుంటాము. అక్కడకు ఇంకా అరవై మైళ్లు ఎగువన అకాడ్ రాజ్యముండేది. దీనికి ఈశాన్యంగా టైగ్రిస్ మాగాణంలోకి వ్యాపించిఉన్న రాజ్యం సిరియా. దీని విస్తీర్ణం బ్రిటన్ దేశమంత. బాబిలోనియా రాజ్యపు విస్తీర్ణం దాదాపు డెన్మార్కు దేశమంత ఉండేది. మిగతా రెండు దేశాల విస్తీర్ణం కూడా ఇంచుమించు ఇంతే.

ఇప్పుడీ గ్రంథం మెసపొటేమియా సాహిత్య చరిత్ర సంగ్రహమే. కాని, ఈ దేశాల వాస్తవ చరిత్రకాదుగా. అందుచేత వాస్తవ చారిత్రక వివరాల జోలికి పోకుండా యూఫ్రెటిస్, టైగ్రిస్ నదుల మధ్య మాగాణాన్నంతనీ ఏక ప్రదేశంగా భావించి గత శతాబ్దాలలో ఇక్కడ జరిగిన సాహిత్య కృషినంతనూ సింహావలోకనం చేద్దాం. చారిత్రకంగా చూస్తే, ఇవి పేరుకు నాలుగు రాజ్యాలేకాని నిజానికి ఒకే ప్రదేశానికి చెందినవి. వీటి ఎల్లలు తరచు తారుమారు అయిపోతూ ఉండేవి. ఒక్క సుమేరియాలో తప్ప మిగతా అన్ని దేశాలలోను పరరాజ్య విజేతలు బయలుదేరారు. ఈ

నాలుగు దేశాలను కలిపి బ్రహ్మాండమైన సామ్రాజ్యాలు నిర్మించారు. అయితే యీ సామ్రాజ్యాలేవీ చిరకాలం వర్ధిల్ల లేదనుకోండి. అది వేరే సంగతి. ఫలితం ఏమిటంటే సాంస్కృతికంగా నాలుగు దేశాలు ఒక్కటే అయినవి. సుమేరియా దేశపు దేవతలను, పురాణాలను, సారస్వతాన్ని, సాంఘికాచారాలను అన్నింటిని కూడా మిగతా వారు యథాతథంగా స్వాయత్తం చేసుకున్నారు.

ఈ నాలుగుజాతులవారిని గురించి మనం ఒక్క సంగతి జ్ఞాపకం పెట్టుకోవాలి. వీరిలో అకాడ్, బాబిలోనియా, అస్సీరియాలలో ప్రజలందరూ సెమిటిక్ జాతివారు. ఈ ప్రాంతంలో అందరికంటె ముందుగా స్థిరనివాసం ఏర్పరచుకున్నవారు వీరేనని చెప్పవలసి ఉంది. సుమేరియనులు వీరి తరువాత వచ్చినవారు. వారికంటె భిన్నమైనది ఈ సుమేరియనుల జాతి. ఒక పర్వతాధిష్ఠాన దేవత వీరికి ఇష్టదైవము. దీనినిబట్టి వీరు తొలుత పర్వతవాసులని, తరువాత మైదానభూములకు వలసవచ్చిన వారని భావించవలసి ఉంది. అసలు వీ రెక్కడివారన్న అంశంపై ఇప్పటికిన్నీ పండితులమధ్య చాలా తీవ్రమైన వాదోపవాదాలు జరుగుతున్నాయి. వీరికిన్నీ, భారతావనిలో ఆర్యులకు పూర్వము నివసించిన ఆదిమవాసులకున్నూ సజాతీయ సన్నిహిత సంబంధాలు చాలా ఉన్నట్టు నిరూపించడానికి బోలెడంత సాక్ష్యముంది. వీరి నాగరకత ఇటీవల సింధులోయలోని మహెంజెదారో, హారప్పాలవద్ద, పంజాబులో రూపార్ వద్ద, రాజస్థాన్‌లో సరస్వతి నదీ గర్భంలోను తుదకు మైసూరులోని పురాతత్వ

శాస్త్రజ్ఞులకు దొరికిన శిథిలావశేషాలద్వారా వ్యక్తమైన ప్రాచీన నాగరకతను అనేకవిధాల పోలిఉంది.

సుమేరియా ప్రజలు రంగంలోకి ఆలస్యంగా వచ్చిన వారైనప్పటికీ సర్వతోముఖమైన నాగరకతను అందరికన్న ముందుగా పెంపొందించుకున్న ప్రతిభావంతులు. మిగతా వారందరూ వీరినిచూచి నాగరకులైనవారే. వీరి ప్రతిభ బహుముఖమైనది. ప్రపంచం మొత్తంమీద మొట్టమొదట సారిగా లిపిని కనిపెట్టినవారు వీరు. ఈ లిపిముందుగా బొమ్మల రూపంలో ప్రారంభమైంది. తరువాత ఆ బొమ్మలు గీత లయ్యాయి. గీతలను గట్టి పలకలమీద చెక్కేవారు. పిమ్మట కొంతకాలానికి మట్టి పలకలు వాడుకలోకి వచ్చాయి. గీత లన్నీ, మట్టివంటి మెత్తని ముద్దమీద అదిగట్టిపడడానికి ముందే గంటు పడేటట్టు వ్రాసేవారు. వ్రాతలో అవి అనేక వంకరలు తిరిగాయి. అస్సీరియాలో అసూర్ బనిపాల్ రాజసౌధం ఉన్నచోట పురాతత్వ శాస్త్రజ్ఞులు సాగించిన త్రవ్వకాల వల్ల లిపి సంకేతాలుగల మట్టిపలకలు ముప్పైవేలు దొరి కాయి. మెసొపొటేమియా చరిత్రను గురించీ, సారస్వ త్వాన్ని గురించీ తెలుసుకోవడానికి ఇవే ఆధారాలు. ఈపలకలలో కొన్ని ఆ దేశపురాజు లేఖకులనుపెట్టి వ్రాయిం చిన పాతకాలపు శాసనాల నకళ్లు. అందుచేత వీటిలో మనకు ఒక్క అస్సీరియాను గురించేకాక, మొత్తం దేశంఅంతటినీగురించి చెప్పేవికూడా చాలాఉన్నాయి. సుమేరియా సంస్కృతి క్రీస్తు పూర్వం 2300 నాటికే చాలా ప్రాచీనమైంది. ఆనాటి మతాధి కారులే మనకు ఒక మాదిరిగా చరిత్రకారులయ్యారు. వీరు

తమకు వీలైనంతలో తమ దేశపు ప్రాచీన చరిత్రకు సంబంధించిన సాక్ష్యాధారాలు సేకరించి పెట్టారు. తమ దేశాన్ని అంతకు పూర్వం పాలించిన రాజుల వంశ వృక్షం ఒకటి తయారు చేశారు. ఇందులో ఉన్న ఒక విశేషం ఏమిటంటే దాన్ని ఒక పట్టాన నమ్మలేము. దీని ప్రకారం ఆ దేశాన్ని పరిపాలించిన రాజులందరి కాలాన్ని కలిపితే నాలుగు లక్షల ముప్పైవేల సంవత్సరాలకు పైగా అవుతుంది. అందుచేత ఇలాంటి కట్టు కథలపై ఆధారపడి ఉండడంకంటె పురాతత్వ శాస్త్రజ్ఞు లకు దొరికిన సాక్ష్యాలపై ఆధారపడి ఉండడం మంచిదని నేటి చరిత్రకారులు అభిప్రాయపడుతున్నారు. ఈ విధంగా తక్కువలో తక్కువ అంచనా వేసి చూసినప్పటికి సుమేరియా ప్రజలదే పశ్చిమాసియాలో ప్రభవించిన ప్రాచీనతమమైన నాగరకత. క్రీస్తుపూర్వం 5262 ప్రాంతాల నిప్పూర్‌ను, క్రీస్తు పూర్వం 4500 ప్రాంతాల కిష్‌ను, క్రీస్తుపూర్వం 3500 ప్రాంతంలో ఉర్‌ను పాలించిన రాజవంశాల చరిత్రను తెలుసు కోవడానికి తగిన ఆధారాలు ఉన్నాయి. ఇదంతా చెప్పడం ఇంతకు చాలాపూర్వమే యీ ప్రాంతంలో మానవులు స్థిరనివాస మేర్పరచు కున్నారని నిరూపించడానికే.

సుమేరియా చరిత్రలో మనకు కానవచ్చే విశేషం ఒకటుంది. సుమేరియా రాజుల పాలనలో ఆ దేశం ఏనాడూ సమైక్యంగా లేదు. అప్పట్లో దేశం అంతటా పెక్కునగర రాజ్యాల కూటంగా ఉండేది. అయితే పరాక్రమ శాలియైన ఏ ప్రభువో బయలుదేరి వీటన్నింటినీ జయించి తన ఏకచ్ఛ త్రాధిపత్యం క్రిందకు తెచ్చుకుంటూండడం ఆ రోజులలో

పరిపాటి అయినపని. సుమేరియా చరిత్రలో ఇలా చాలా సార్లు జరిగింది. క్రీస్తుపూర్వం 538 లో పర్ష్యారాజు సైరస్ జయించి తన సామ్రాజ్యంలో పూర్తిగా లీనం చేసుకునే వరకు మెసొపొటేమియా చరిత్రఅంతా అంతఃకలహాలతో పరస్పరం యుద్ధాలతో నిండిఉండేది. ప్రతి శతాబ్దిలోను మహావీరుడైన విజేత ఎవ్వడో ఒకడు బయలు దేరుతూ ఉండేవాడు. కాలం గడచినకొలదీ నూతన విజేతలు బయలు దేరి పాతవారిని ఓడిస్తూ ఉండేవారు. ఈ విజేతల దండయాత్రలు, పరాజయాలు, అంతఃకలహాలు అన్నీ కూడా ఆనాటి సారస్వతంలోకి ఎక్కాయి. వీటన్నింటిని గురించి తెలుసుకునే ముందు వీరి జీవితవిధానాలను గురించి కొంత తెలుసుకోవడం అవసరం. వీరు చరిత్రకు ఆది మూల పురుషులు. జగన్నాటక రంగంలో ఇప్పటికి చాలా కాలానికి పూర్వమే తమ పాత్రలను తాము నిర్వర్తించి నిష్క్రమించారు.

మెసొపొటేమియన్ నాగరకత భగవద్భక్తిపరమైనది. పరిపాలన, ప్రభుత్వ నిర్వహణ అంతా దేవుని పేరిట జరిగేది. రాజ్యానికి అసలు ప్రభువు పరమాత్ముడేనని, ఆయన అంశతోనే పాలకులు అవతరించారని ప్రజలు నమ్మేవారు. ఈ రాజులు వస్తుతః పూజారులు. తరువాత చాలాకాలం పాలకులు యీ పూజారుల పలుకుబడిక్రింద, వారి చెప్పుచేతలలో ఉండేవారు. అందుకనే ఆనాటిరాజ్యాల పేర్లు ఆయా అధిష్ఠాన దేవతల పేర్లనుబట్టే ఏర్పడ్డాయి. అసూర్ అనే దేవత పాలనలోఉన్న దేశంకనుక ఆ దేశానికి అసరియాఅని పేరు

వచ్చింది. బేబిలన్ అనే మాటకు అర్థం భగవానుని సింహ ద్వారం అని. ఈ దేవుని పేరు మర్దుక్. కర్-షమాష్ అనే పదానికి అర్థం షమాష్ దేవుని దుర్గం అని.

సర్-అదడ్ అనే పేరుకు అర్థం అదడ్ దేవుని వెలుగు అని. నిప్పూర్ అధిష్ఠాన దైవంపేరు ఎన్‌లిల్. ఎన్‌లిల్ అనే చోట యీ దేవు డుండేవాడు. ఇక్కడ రాజు అనగా ప్రభువు లేదా పాలకుడు అని అర్థం అనగా యీరాజు దైవప్రతినిధిగా పరిపాలన సాగించేవాడు అన్నమాట. దేశంలో మతాధికారు లందరూ ప్రభువుగా పట్టాభిషిక్తునిచేసేవరకు ఎవ్వరూ గుర్తించే వారు కాదు. ఈ పట్టాభిషేక మహోత్సవ సందర్భంలో ప్రభువును సైతం పూజారి దుస్తులతో పూర్తిగా అలంక రించే వారు. బహుశా పూజారే క్రమంగా ప్రభువుగా మారిపోయి ఉండాలి. ఆ రోజుల్లో దేవాలయాలకు ఆస్తి చాలా ఉండేది. పైగా ప్రభువులు జయించిన ప్రతి యుద్ధం లోనూ మెట్టువాటా దేవునికే దక్కేది. దానా దీనా యీ పూజారులు ధనాఢ్యులై కుబేర సంపత్తితో తులతూగే వారు. కాలక్రమేణా ఎవరికి ఏ విధమైన పెట్టుబడి కావలసి వచ్చినా యీ పూజారులకేసి అర్రులు సాచేవారు. దేశంలో వడ్డీ వ్యాపారం, వాణిజ్యం అంతా వీరి పరమైపోయింది.

సుమేరియాలో, మొదట్లో ఒక్కొక్క నగరానికి ఒక్కొక్క రాజు ఉండేవాడు. ఆ నగరాధిష్ఠాన దైవానికి ప్రతినిధిగా ఈయన సర్వాధికారాలు చలాయించేవాడు. ఆ తరువాత కాలక్రమేణ పరాక్రమవంతులైన పలువురు విజేతలు బయలుదేరి మహాసామ్రాజ్యాలు స్థాపించారు.

ఆ సమయాలలో యీ నగరరాజ్యాలను పాలించే చిన్న చిన్న రాజులంతా నిజంగానే రాజ ప్రతినిధులైపోయారు. ఇక రాజు, సార్వభౌముడై దైవాంశసంభూతుడై సాక్షాత్తు దేవుని ప్రతినిధిగా పూజారులలో నోరున్న వారిని సర్వవిధాల సంతోష పెడుతూ ప్రజలను పాలించేవాడు. అతి ప్రాచీనకాలంనుంచీ కూడా ఈ రాజ్యాలన్నీ పరస్పర విజిగీషతో యుద్ధాలలో మునిగి తేలుతూఉండేవి. కనుక సైనికవ్యవస్థ ఈ నాగరకతకు మూల స్తంభమైంది. వాణిజ్యం, వ్యాపారం సక్రమంగా సాగడానికి తోడ్పడే ముఖ్యమైన రహదారులను అదుపాజ్ఞలలో ఉంచు కోవడానికి, ఇతరులను దోచుకుని అప్పనంగాఅమిరే భాగ్య భోగాలను అనుభవించడానికి ఆశపడి అతి తరచుగా యుద్ధాలు సాగిస్తూ ఉండేవారు. ఇరుగు పొరుగునఉన్న ఎలమ్ రాజ్యంనిండా వెండిగనులు చాలా ఉండేవి. అందుకని అందరి కళ్లూ దానిమీదే పడ్డాయి. ఆ రోజుల్లో అవకాశం చిక్కినప్పుడల్లా పొరుగు దేశపు ప్రభువు లందరూ దానిపై దండయాత్ర చేసినవారే. ఆ రోజుల్లో రాజులు రథా రూఢులై, విల్లంబులు, ఈటెలు, పరశువులు ధరించిన పదాతి దళాలను వెంటబెట్టుకుని ఇరుగుపొరుగు వారిపై దండ యాత్రలు సాగించేవారు. ఈ నాలుగు జాతుల వారిలోను అసీరియా ప్రజలు వీరాధివీరులు. వీరి పరాక్రమం అనుపమం. వీరి పేరు వింటే చాలు, వైరి వీరులు గడగడలాడి పోయే వారు. యుద్ధంలో దీలుగాపట్టుబడ్డ శత్రుసైనికులలో దృఢగాత్రు లందరినీ బానిసలుగా అమ్మిపారవేసేవారు. మిగతావారిని కనికరం లేకుండా ముక్కలు ముక్కలుగా నరికి పారవేసే

వారు. క్రూరులైన అసీరియా ప్రజల కులదేవతలకి నరబలులంటే చాలా ఇష్టం. యుద్ధంలో తమకు విజయాన్ని చేకూర్చి పెట్టినందుకు కృతజ్ఞతా సూచకంగా ఈ అసీరియా విజేతలు తమ ఇష్ట దేవతలకు యుద్ధఖైదీలుగా పట్టుబడిన వేలకొలది వైరివీరులను ఏకకాలంలో ఒక్కుమ్మడిగా బలి ఇచ్చేసేవారు. మున్ముందు విప్లవాలు బయలు దేరకుండా ముందు జాగ్రత్తకోసమని ఓడినవారిలో అనేక వేలమందిని పట్టుకుని మూకఉమ్మడిగా స్వస్థానాల నుంచి తరలించేవారు. సామ్రాజ్యంలో మారుమూల ప్రాంతాలకు వారి స్వస్థాన వేషభాషల వాసన తగలని చోట్లకు బానిసలుగా రవాణా చేసేవారు. క్రీస్తుశకం ఇరవయ్యో శతాబ్దంలోపుట్టిన మనం ఒక తరంలో రెండు ప్రపంచ మహాయుద్ధాలు చూశాం. మూడోది ఏక్షణంలో నైనా ప్రళయభీకరంగా విరుచుకు పడేటట్టుగా ఉంది. బహుశా యీ మూడోయుద్ధమేఅంటూవస్తే మానవ నాగరకతే మటుమాయమై పోవచ్చు. అలాంటి విపరీత పరిస్థితులలో నివసిస్తున్న మనం ఆ ప్రాచీనకాలంలో ప్రబలిన అరాజకత్వాన్ని గురించి అతిశయోక్తులు చెప్పకో కూడదు. అప్పట్లో ఎన్ని యుద్ధాలు జరిగినా నాగరకత నశించిపోలేదు సరిగదా నానాటికి వృద్ధిచెందింది. మానవులు మానవులుగా బ్రతుకుతున్నారన్నా, కేవలం జీవచ్ఛవాలుగా బ్రతకడం లేదన్నా అందుకు తార్కాణ నానాటికి చేవదేరుతున్న కళలూ, సుసాంప్రదాయాలూ మాత్రమే. శాసనాలన్నీ దుర్బలులనూ, నిరుపేదలనూ అణచిపారవేయడానికి ధన

లైనా సరే వీరు విచారించి తీర్పు చెప్పేవారు. ఇచ్చిపుచ్చుకోడాలలోను, క్రయ విక్రయాలలోను, దత్తతలు, భరణపు దావాలలోను వచ్చిన తగువు లన్నింటిని వీరు తీర్చేవారు.

ఏకపత్నీవ్రతులై ఉండడం ఉత్తమ గృహస్థ ధర్మానికి పరాకాష్ఠ. కానీ ఉంపుడుకత్తెను ఉంచుకోడం సంప్రదాయ సిద్ధంగా తప్పుకాదు. దేవదాసీలవలె ఆ కాలంలో కూడా దేవాలయాలను ఆశ్రయించుకున్న వ్యభిచారిణు లుండేవారు. కాని చట్టం ప్రకారం ఒక పురుషునికి ఒక భార్య కంటె హెచ్చుమంది ఉండరాదు. పెండ్లి వేళ కన్యాదాన శుల్కం ఎంత ఇవ్వాలో వధువే నిర్ణయించడం పరిపాటిగా ఉండేది. భర్త ప్రమేయం లేకుండా స్వంతంగా వ్యాపారం చేసుకునే హక్కు ఆనాడు స్త్రీలకు సర్వసామాన్యం. తమ ప్రజలను సముదారచిత్తంతో కన్నబిడ్డలవలె పరిపాలించిన కొంత మంది రాజులూ, రాణులూ మెసొపొటేమియా చరిత్రలో లేకపోలేదు. వారసత్వపు హక్కుల విషయంలోనేమి, వస్తువులను పంచుకోవడం విషయంలోనేమి మెసొపొటేమియా శాసనకర్తలు ఎల్లప్పుడూ కుటుంబానికే ప్రాధాన్యం ఇచ్చారు. సాధ్యమైనంతవరకు సమష్టి కుటుంబం యథాతథంగా విచ్ఛిన్నం కాకుండా ఉండేటట్టు చూడడానికే వారు ప్రాధాన్యం ఇచ్చారు. వ్యక్తుల హక్కుల నిరూపణలో, వ్యవహార నిర్వహణలో ఎల్లెడల వారు యిదే దృష్టితో వ్యవహరించారు.

మొట్టమొదట మెసొపొటేమియా ప్రజలు అడుసు, వట్టిగడ్డి కలిపి ముద్దలుచేసి కట్టుకున్న పూరిళ్ళలో నివసించే

వారు. ఎండ వేడిమికి ఈ అడుసు రాయిలా గట్టిగా బిగుసుకు పోయేది. గట్టితనంకోసం కొయ్యకమ్ములతో వాసం బిగించి దానిమీద పూరిపరచి మట్టితో కప్పేసేవారు. కాలక్రమేణ ధనికులు బయలుదేరడంతో గట్టి కట్టడాలు వాడుకలోకి వచ్చాయి. ఇళ్ళనిండా సామానులు చాలా ఉండేవి. ఏటేటా నదులవరదల్లో దేశమంతా బురద అయిపోతూ ఉండేది. అందువల్ల కేవలం పరిస్థితుల ఒత్తిడివల్ల మెసొపొటేమియా ప్రజలు ప్రాచీన కాలంనుంచి వ్యవసాయం చేయడం ఎలాగో నేర్చుకోవలసివచ్చింది. నదులకు వచ్చే అదనపు వరదనీరు దేశమంతటినీ ముంచివేయకుండా కాలువలలోకి, బోదెల లోకి మళ్ళించి దేశం నాలుగు మూలలకీ వారి పంటచేలకు పెట్టేసేవారు. క్రీస్తు పూర్వం నాలుగువేల సంవత్సరాల నాటికే వీరు దేశమంతటా వలలతో కప్పినట్లు కాలువలతో నింపివేశారు. అప్పటికే వారికి కొయ్యనాగళ్ళ ఉపయోగం తెలుసు. ఈ నాగళ్ళకు ఎడ్లను పూన్చి చేలు దున్నేవారు. ఆదికాలంలోనే వీరి పనిముట్లుఅన్నీ చెకుముకిరాతితోను, దంతంతోను, ఎముకలతోను తయారైనవి. తరువాత కొంతకాలానికి లోహాలను పోతపోయడం, మట్టి పాత్రలకు మెరుగుపెట్టడం, గాజుపోత పోయడం కూడా నేర్చుకున్నారు. ఆనాడు వారికి బట్టలఅద్దకం తెలుసు. అనేక రంగు లతో, పుష్పాలతో, లతలతో చిత్రవిచిత్రమైన నమూ నాలలో బట్టలపై అందమైన అద్దకపుపని చేసేవారు. బహుశా నేత పరిశ్రమ ప్రత్యేకంగా ప్రభుత్వ పర్యవేక్షణలో ఉండేది. నేత సరిగా సాగుతున్నదో లేదో అజమాయిషీ

చేయడంకోసం ప్రభువులే పర్యవేక్షకులను నియమించే వారు. మెసొపొటేమియా ప్రజలకు ప్రయాణాలు చేయడం తెలుసు. రహదారులపై బళ్లు, ఇతర వాహనాలు ఎక్కి దూరప్రయాణాలు చేస్తూండేవారు. వీరికి పడవప్రయాణాలు కూడా పరిపాటి. ప్రాచీనకాలపు ప్రజలు ఉపయోగించిన శకటాల నమూనాలు కొన్ని పురాతత్వశాస్త్రజ్ఞులకు కిష్ ప్రాంతంలో లభించాయి. మొదట్లో ఈ బళ్లను గాడిదలను పూన్చి తోలేవారు. క్రీస్తుపూర్వం రెండు వేల సంవత్సరాల నాటికే బళ్లకు గుర్రాలను పూన్చడం ప్రారంభమైంది. శాంతికాలంలో బేహారపు బిడారులకోసం, యుద్ధకాలంలో దండయాత్రలు వెడలే సేనానివహాలకోసం ఉపయోగపడే టట్లు అనేకమంది రాజులు దేశం నలుమూలలనూ కలిపే రహదారులను, రాజమార్గాలను నిర్మించారు. అప్పటి కింకా నాణెములంటూ ఏమీ చలామణీలోకి రాలేదు. కాని వ్యాపారం అంతా సరికి సరి సరుకు ఇచ్చి సరుకు పుచ్చుకునే మారకపు పద్ధతిలో సాగేది. అయితే వెండిబంగారాలకు విలువ క్రమంగా పెరిగింది. కాగా ఎంతో కొంత బంగారమో, వెండో ఇచ్చి సరుకులు పుచ్చుకోవడం కూడా ప్రారంభమైంది. కాని, రాజముద్రతో ప్రభుత్వ ఆమోదం పొందిన నాణెముల చలామణీ వారికి తెలియదు.

కాలంతో బాటు సమాజంలో వర్గాలు క్రమంగా ఏర్పడ్డాయి. రాజవంశీకులకూ, సామాన్య ప్రజలకూ మధ్య మొట్టుగా సామంతవర్గం ఏర్పడింది. వీరికి ప్రభువులు యుద్ధం అయిపోయిన ప్రతిసారీ జాగీరులు, ఇనాములు ఇచ్చేవారు.

వీ రోకమాదిరి జమీందారులు. అసీరియా ప్రజలలో సంపన్నులందరూ భూస్వాములు. బాబిలోనియా సంపన్ను లలో చాలామంది వ్యాపారులు. ఆనాటి సమాజంలో చివరకు అయిదు వర్గాల ప్రజలు మిగిలారు. సంపన్నులైన సామం తులు, వ్యాపారులు, నిపుణులైన సామంతులు, కార్మికులు. వీరు వృత్తులనుబట్టి భిన్నభిన్నవర్గాలుగా ఏర్పడ్డారు. రైతులు. ఏపనీ అంతబాగా చేతకానివారు. బస్తీలలో కూలి పని చేసేవారు మూడో వర్గానికి చెందినవారు. పగలూ రాత్రీ సామంతుల పొలాలలో పనిచేసే పాలికాపులు నాలుగో వర్గంవారు. అందరికంటె ఆఖరివర్గానికి చెందినవారు బానిసలు. వీరిలో చాలామంది యుద్ధఖైదీలుగా పట్టుబడినవారే.

చాలా దేవాలయాలకు అనుబంధంగా పాఠశాల లుండేవి. వీటిలో పూజారులే బజ్జలు. వీరు మొగపిల్లలకు చదవడం, వ్రాయడం, లెక్కలు చేయడం ఎలాగో నేర్ప డంతోబాటు పురాణేతిహాసాలను, మతాన్ని బోధించే వారు. మెసొపొటేమియాలో శాస్త్ర విజ్ఞానం మొదట ఇంద్ర జాల, మహేంద్రజాల విద్యగా ప్రారంభమైనప్పటికీ క్రమేణా స్వతంత్ర విద్యగా రూపొందింది. అలాగే మొదట జ్యోతి షంగా ప్రజలను ఆకర్షించిన విద్య చివరకు ఖగోళశాస్త్రంగా పరిణమించింది. సూర్య చంద్రాది గ్రహాల గతులను గురించి, గ్రహణాలను గురించి, గ్రహానికి నక్షత్రానికి గల తేడాలను గురించి ప్రపంచంలో అందరికంటె ముందుగా తెలుసుకున్న వారు బహుశా బాబిలోనియా ప్రజలనే చెప్పాలి. నెలకు నాలుగు వారాలని, గడియారానికి ఇరవై నాలుగు గంటలు

కాకుండా పన్నెండు గంటలు మాత్రమే ఉండాలని, గంటకు అరవై నిముషాలని, నిముషానికి అరవై క్షణాలని నిర్ణయం చేసినవారుకూడా వీరే. బాబిలోనియా ప్రజలు కాల ప్రమాణాన్ని యీ విధంగానే పాటించేవారని చెప్పడానికి చాలా సాక్ష్యం ఉంది. ఆకాశాన్ని పరిశీలించి పటాలు తయారుచేసి గ్రహాల ఉనికిని గుర్తించడం నేర్చుకున్నవారు కూడా బాబిలోనియా ప్రజలే. మొట్టమొదటగా దేశపటాలను కూడా వీరే తయారు చేయడం ప్రారంభించారు.

మెసొపొటేమియా ప్రజల ప్రజ్ఞ ఇంతటితో ఆగలేదు. వారు గొప్ప కళారాధకులు. అనేకరకములైన కళలలో వారు గణనీయమైన ప్రావీణ్యాన్ని సంపాదించారు. పండుటిటుకలతో మూడు లగాయితు ఏడు అంతస్థులుండే గోపురాల పద్ధతిలో బాబిలోనియా ప్రజలు దేవాలయాలు నిర్మించుకున్నారు. అసీరియావారు ఇటుకలతో వేదికలు నిర్మించి వాటిమీద బ్రహ్మాండమైన భవంతులు కట్టారు. బాబిలోనియా ప్రజలలో చాలామందికి అభిమానవిద్య శిల్పం. దేశంలో వివిధ ప్రాంతాలలో లభించే బండరాళ్లను వారు జీవకళ ఉట్టిపడే సుందర శిల్పాలుగా మలిచారు. ప్రతిమాశిల్పంలో వారు ప్రత్యేకంగా ప్రవీణులు. చెక్కడానికి పనికివచ్చే రాయి పుష్కలంగా దొరికే గనికోసం ఆ దేశపు ప్రభువు పెద్ద యుద్ధమే సాగించినట్టు నిదర్శనాలున్నాయి. గని లేకపోతే రాయిదొరకదు. రాయి దొరకకపోతే శిల్పి లెందరున్నప్పటికీ తన ప్రతిమలు చెక్కలేరు. శిలాప్రతిమలు లేకపోతే భావి తరాల వారికి తన ఉనికి, మనికి, పరాక్రమం, పౌరుషం అన్నింటిని

గురించి ఎలా తెలుస్తుంది? అందుకోసం, ఆ ప్రభువు రాతి గనికోసం అంతహంగామా చేశాడు. బాబిలోనియా శిల్పులు నిర్మించిన సుందర ప్రతిమలు చాలావరకూ మానవులవే. వీరిలో కూర్చున్నవారూ ఉన్నారు. నిలబడినవారూ ఉన్నారు. ఏదో అనిర్వచనీయమైన భక్తిభావంతో చేతులు జోడించి ప్రార్థనలు చేస్తున్నవారూ ఉన్నారు. ప్రాచీనకాలపు బాబిలోనియా కళాకారులు తల మానవునిదీ, మిగతా శరీర మంతా పసరానిది అయిన ఒక రకం చిత్రమైన నరవృష భాన్ని సృష్టించారు. ఈ నరవృషభం తరువాత తరువాత ప్రాచ్య పాశ్చాత్య చిత్రకారులకు అవశ్యానుసరణీయమైంది. అసీరియా శిల్పులు పూర్ణవృత్తం చిత్రించినట్లు లేదుకాని పల కలమీద గంట్లుపెట్టి చాలా బొమ్మలు చిత్రించారు. ఇవి వారి వీరత్వానికి, యుద్ధపిపాసకు, పోటరితనానికి మంచి నిదర్శ నాలు. వారు చిత్రించిన జంతువులలో గుర్రానికీ, సింహానికీ ప్రత్యేక ప్రాధాన్య ముంది. శౌర్యం, ధైర్యం, జీవకళ ఉట్టి పడుతూ వీరు చిత్రించిన ఈ నమూనాలు ప్రపంచం మొత్తం మీద నాటికీ నేటికీ కూడా ప్రథమగణ్యాలు. సంపన్నుల సౌధాల గోడలనిండా అందమైన బొమ్మలు చాలా చిత్రించే వారు. అయితే వర్ణచిత్రరచన ఆ కాలంలో గోడలకు మాత్రమే పరిమితమైపోయిందనే చెప్పాలి. గోడలను అలంక రించడం కోసమే కాని ప్రత్యేక కళగా చిత్రలేఖనాన్ని అప్పట్లో ఎవ్వరూ అభ్యసించినట్లు లేదు. పెంకులపై ముందుగా అందమైన బొమ్మలు చెక్కి వాటికి మెరుగుపెట్టి గోడలలో పొదిగేవారు. ఈ కళను వీరి దగ్గరనుంచి పర్షియనులు నేర్చు

కుని బాగా వృద్ధిచేసి ప్రత్యేక నైపుణ్యాన్ని సంపాదించారు. చేతివృత్తులు చాలా సున్నితమైన ఉన్నత స్థాయిని అందుకున్నాయి. పోతపోసిన కంచు, ఇనుము, వెండి, బంగారు పాత్రలు, అందాలుచిందే ఆభరణాలు, లేసులు, నాజూకైన దుప్పట్లు, అద్దకపుపనిలో కన్ను చెదిరిపోయే దుస్తులు, మనోహరమైన మేజాలు, పరుపులు, మంచాలు, కుర్చీలు వీటన్నింటితో జీవితం భాగ్యభోగ్యాలతో ఆనందంగా ఉండేది.

ఉర్‌ను పరిపాలించిన కొంతమంది ప్రాచీన ప్రభువుల గోరీలను త్రవ్వినప్పుడు పురాతత్వవేత్తలకు చాలా మేలిరకం వీణ వంటి తంత్రీ వాద్యాలు దొరికాయి. వీటిమీద అందం కోసం, అలంకారంకోసం ఎద్దుతల, ఆవుతల, దుప్పితల ఒక రేమిటి అనేక జంతువుల తలలను చెక్కేవారు.

మద్దెలలు, మధురనిస్వనాలొలికించే తంత్రీ వాద్యాలు, బూరాలు, తప్పెటలు, తాళాలు నగారా వాద్యాలన్నింటిని గురించి వారికి తెలుసు. దేవాలయాలలో, సంపన్నుల సౌధ ప్రాంగణాలలో, విందులలో, వేడుక సమయాలలో, మేళ తాళాలతో పాటకచ్చేరీలు, గోష్ఠి గానాలు జరుగుతూనే ఉండేవి.

## అధ్యాయం 2

# నరుడు - నారాయణుడు

రచనావ్యాసంగానికి ప్రేరణ నిత్య జీవితానుభవమే. పైగా అనుక్షణ అభ్యాసంవల్ల శైలి నవనవోన్మేషమై ఎప్పటి కప్పుడు కొత్తమెరుగులు సంతరించుకుంటూ ఉంటుంది. ప్రేరణకు, సాధనకు సమన్వయం కుదిరిననాడే రచన సార్థక మవుతుంది. అయితే తరాని కొరీతిగా ఈ సమన్వయ సాధన జరిగింది. ప్రాచీన కాలంలో స్వయంసిద్ధమై, హేతువాదానికి అతీతమైన ప్రేరణవల్లనే తొలిభాషలలో మహా కావ్యాలు వెలిశాయి. అయితే తరువాతికాలంలో వచ్చిన మహా కావ్యాలలో ఆత్మవిశ్వాసంతో కూడిన శిల్పనైపుణ్యం అడు గడుగునా తొణికిసలాడుతూ ఉంటుంది. భావము, భాష ఒక దానికొకటి దోహదం కావడంచేత వాగర్థాలకు అవినాభావ సంబంధం ఏర్పడింది. కాని చివరి దశలలో శైలికి ప్రాధాన్యత హెచ్చి కథాకథనం దుర్బలం అవుతుంది. నాగరికత ప్రారంభ మైన తొలిదినాలలో కవితా శిల్పపు ప్రమేయం లేకుండానే సహజధారగా స్వయంభువమైన, ఛందోబద్ధమైన భావబంధుర మైన సుందరకవిత వెలువడింది. అయితే ౧౭-౧౮ శతాబ్దులలో

ఐరోపాఖండంలో సాహితీ ప్రియులందరిని అలరించిన నవీన సాహిత్యోద్యమం ప్రాచీన నాగరికతలకు ప్రతిబింబంగా నిలిచిన తొలిసాహిత్యాన్ని, ఉత్తమ సారస్వతంగా గుర్తించ నిరాకరించింది. కాని కాలం ఒక్కరీతిగా గడవదు. పందొమ్మిదో శతాబ్దం వచ్చేసరికి కొత్తకవులు బయలుదేరారు. వీరు శృంగార ప్రధానమైన ఇతివృత్తాలలో ప్రాచీన సంప్రదాయంలో కొత్త కవిత్వం అల్లడం ప్రారంభించారు. వీరి కృషి ఫలితంగా శృంగార కవిత్వానికి ప్రజాదరణ తిరిగి లభించడంలో ప్రాచీనకాలపు సాహిత్యంపై అంతవరకూ ఉండిన నిరాదరణభావం సమసిపోయింది.

ఒకప్పుడు అనాదరణీయమని సాహితీవేత్తలు త్రోసి వేసిన ఈ అతిప్రాచీన సారస్వతం ఇప్పుడు తిరిగి ప్రజాదరణకు పాత్రమైంది. లలిత కళలకు, సారస్వతానికి నాందియైన ఈ ప్రాచీన ప్రారంభ వాఙ్మయాన్ని ఈనాడు పండితులందరూ చదివి ఆనందిస్తూండడమే కాకుండా సదస్సులలో సముచిత స్థానాన్ని ఇచ్చి గౌరవిస్తున్నారు కూడా.

కల్పనకు, మూఢవిశ్వాసాలకు గల తేడాలను ౧౭-౧౮ శతాబ్దాలనాటి ఐరోపీయ నవీన సాహిత్యోద్యమ నాయకులు గుర్తించినట్లు కనబడదు. ఈనాడు మన సమకాలికులందరూ కాల్పనిక సాహిత్యానికి ప్రత్యేక ప్రాధాన్యం ఇచ్చారు. కవి ఊహాజగత్తుకు కల్పన పునాది. ఒక్కొక్కసారి ఇది శ్రుతి మించిన దనిపిస్తుంది. ఎందుకంటె ఒక్కొక్క మహాకవి ఒక్కొక్క విధంగా తన కల్పనకు అనుగుణంగా వాస్తవికతను పూర్తిగా వదిలివేసి కొత్త పురాణాలు చాలా తయారుచేసి

మంది దేవతలు ఉన్నారు. అందుచేత మెసొపొటేమియాలో ఆనాడు అరవై అయిదు వేలమంది ఉన్నారంటే మనం ఆశ్చర్య పడవలసిన పనిలేదు. వీరిలో చాలామంది అనామకులు. ఇందరిలోనూ ముఖ్యులు కొలదిమందే. మెసొపొటేమియాలో ఆనాడు నివసించిన నాలుగుజాతులవారు కాలక్రమాన ఏక జాతిగా మారిపోయినట్లే వారి దేవగణంకూడా వ్యక్తిత్వాన్ని కోల్పోయి పేచీలు లేకుండా ఒక్కటై పోయారు. ఆ రోజు లలో కూడా పాతక్రొత్త తరాలవారిమధ్య సంఘర్షణ జరిగేది. ఇందులో అనివార్యంగా యువకులదే పైచేయి. అయితే ఇరుపక్షాలు రాజీపడుతూండడం పరిపాటి. ఈ రాజీ ఏర్పాట్ల ప్రకారం విజేతలైన యువకుల అభిమానదైవం విజితులైన వృద్ధుల అభిమాన దైవానికి అనుంగు పుత్రుడుగా అమరేవాడు.

ఈ విధంగా అనేకములైన మార్పులు, చేర్పులు జరిగిన తరువాత "అను" అనే దేవుడు స్వర్గానికి అధిపతిగా స్థిర పడ్డాడు. మన మర్త్యలోకానికి ఎన్‌లిల్ ప్రభువు. ఇక జలాధి దేవతపేరు ఇయా. బాబిలోనియా అధిష్ఠాన దైవంపేరు మర్దుక్. ఈయన ఇయా పుత్రుడు. దీని ప్రకారం అను ముసలివాడై పరిపాలనను రాజ్యాధికారాన్ని మర్యాదగా మర్దుక్‌కు అప్పగిస్తాడు.

దేవేంద్రుడైన అను వట్టి ఛాయా గ్రహం వంటివాడు కాని ఎన్‌లిల్ ప్రాచీన కాలమునుంచి ఈ ప్రాంతీయ ప్రజలకు ఆరాధ్యదైవం. నిజానికి ఈయన సుమేరియా ప్రజల దేవుడు. వీరు పార్వతేయులు. వీరు కాలక్రమాన తమ పర్వత నివాసా

లను వదలిపెట్టి మైదానాలలోకివచ్చి స్థిరపడినవారు. పర్వతా లను సైతం కదిలించి వేయగల ప్రళయ ప్రభంజనంలోపర్వత సానువుల్నింటిలోను ప్రతిధ్వనించిన ప్రళయకాల మహోగ్ర భయదజీమూతోరుగళ గంభీర ఘెళఘెళార్భటులలో వారు విశ్వరచనకు మూల కారణమైన ఆదిశక్తి సందేశాన్ని విన్నారు. కనుకనే వీరి ఇష్టదైవమైన ఎన్‌లిల్, కొండలోయలను కల్లోల తరంగాభీలమైన కాసారాలుగా మార్చివేసే కుంభ వృష్టికి కారణమైన పర్వతసీమలలో ప్రభవించిన ప్రజ్ఞాశాలి. ఈ దేవుని ధైర్యసాహసాలను, పౌరుష పరాక్రమాలను ప్రస్తుతిస్తూ చాలామంది పాటలు కట్టారు. ఇవి ఆనాటివారి కమనీయ కవితాధోరణికి, కల్పనా చాతురికి మంచి నిదర్శ నాలు. పైకి కనుపించే తుపానులు, వానలు, వరదలు, కంటికి కనుపించని అదృశ్య శక్తికి ప్రత్యక్ష చిహ్నాలుగా వారు పరిగ్ర హించారు.

భూనభాలు దద్దరిల్ల
గర్జించెను పర్జన్యము
భూతధాత్రి క్షోభిల్లగ
వర్షించెను ఘనాఘనము
అది ప్రళయ వర్షమ్మ,
అప్రతిహతమ్మ్మన్,
జృంభించి ఛేదించి
ముంచు సర్వమ్మ్మన్
పండి, తలవంచి, నిలు
చుండు సస్యమ్మ్మన్,

ఉన్న మిత దీర్ఘ పట
వృక్ష షండమ్మున్
ధర్షించి పెకలించి
ముంచె వర్షమ్మున్.

ఆ తరువాత కొంత కాలానికి సుమేరియా ప్రజలు మైదానపు భూములలోనే స్థిరపడ్డారు. వ్యవసాయం వారికి ప్రధానవృత్తి అయింది. అప్పుడు ఎన్‌లిల్ వ్యవసాయానికి అధిదేవత అయ్యాడు. అందుచేత ఆయన స్వభావంలో చాలా మార్పువచ్చింది. తుపానుకి, ప్రళయానికి ప్రభువైన ఎన్‌లిల్ కఠోరలక్షణాలన్నీ ఆయనకు అనుచరుడుగా ఉండే అదార్‌కు సంక్రమించాయి. మన దేశంలో పరమ శివునికీ, కాలభైరవునికిఉన్న సంబంధంవంటిదే ఎన్‌లిల్‌కీ, అదార్‌కీ ఉన్న చుట్టరికం. ఈ అదార్ లయకారుడు. స్వర్గ మర్త్య పాతాళాలను ఏకకాలంలో నాశనంచేసి పారవేయగల ప్రళయరుద్రుడు. దేవతలకు కోపంవచ్చి ప్రళయాన్ని కల్పించ దలచుకున్నపుడు భూమిని గజగజ లాడించగల శక్తిమంతుడు అదార్ మాత్రమే. లయకాల ప్రళయాన్ని కల్పించగలమహాశక్తివంతుణ్ణి ఆనాటి మెసొపొటేమియా కవులు ఎలా వర్ణించారో చూడండి...

లోకేశుడు క్రుద్ధుడైన
లోకాలే చీకాకగు
సకలధరణి శకలములై
వికలములగు కులనగములు.
లోకేశుని గర్జన విని

నాక పతులు, భూమిపతులు
తమ తమ నెలవుల కలుగుల
తలలుదూస్తు రతిభీతిని.
లోకేశుని ప్రళయకాల
భీకరకర వజ్రాహతి
దివాకరుడు నిశాకరుడు
దిశాంతములకై పరతుకు.

నీటిని మన పూర్వులు సార్థకంగా జీవన మన్నారు. నీరు లేనిదే మనుగడే లేదు. అసలు ఆహారం తరువాతఅందరికి కావలసింది నీరే. నాగరికతకు పునాదిసైతం నీరే. అందుచేత జలాధి దేవతఅయిన ఇయ నాగరకతకు సైతం అధిష్ఠాన దేవత అయ్యాడు. ఆయనను మానవజాతికి పరమ మిత్రముగా ప్రస్తుతించారు. ఆపదలు గడిపే ఆర్తత్రాణపరాయణుడుగా, అనాధనాధుడుగా అందరూ ముందుగా అన్ని సందర్భాలలోను ఈ దేవుణ్ణే ప్రార్థించేవారు. నబూ అనే దేవుడు ఇంకొకడు ఉన్నాడు. ఈయన కర్మసాక్షి. సకల సృష్టికి ఈయన సాక్షి మాత్రుడు. ఆగత అనాగతాలు తెలిసిన త్రికాలజ్ఞుడు. బాబిలోనియా ప్రజలు వస్తుతః జ్యోతిశ్శాస్త్ర ప్రియులు. వీరి దృష్టిలో గోచారాన్ని పరిశీలించి భవితవ్యాన్ని గురించి తు, చ తప్పకుండా జోస్యంచెప్పగలదైవజ్ఞశిఖామణి నబూ. తారకావృతమైన గగనపథాన్ని పరిశీలించి మేషాదిరాసులను, గ్రహగమనాన్ని వివరించగల పండితుడు. ఏమైనప్పటికీ విధి నిర్ణయాలను నమోదుచేసే చిత్రగుప్తుడులాంటివాడు ఈ నబూ.

షమాష్ సాక్షాత్తు సూర్యభగవానుడే. మానవ కోటికి మిత్రుడు. తన సహస్రకరాలతో దశదిశలకు వేడినీ, వెలుగునీ అందిస్తూ భూతలం అంతనీ సస్యశ్యామలం చేసే సవిత్రుణ్ణి సకల సంపదలకు దాతగా, త్రాతగా స్తుతించారు. రోజంతా పర్యటిస్తూ ప్రపంచానికంతకూ వెలుగును ప్రస రించే సూర్యదేవుణ్ణి సర్వజ్ఞుడుగా పరిగణించారు. జగత్తులో రవి స్పర్శలేని తావు లేదు. కనుక ప్రపంచంలో జరిగే ప్రతీ పనీ ఆయన కంటపడి తీరుతుంది. కనుక నిజానిజాలు తేల్చి న్యాయం చెప్పగల న్యాయమూర్తిగా ఆదిత్యుణ్ణి ఆరా ధించారు. వారి దృష్టిలో దినమణి శిష్టరక్షణ దుష్టశిక్షణ దక్షుడైన ధర్మమూర్తి. ఈ విధంగా మెసొపొటేమియా ప్రజలు ప్రకృతిలో కానవచ్చే మహాశక్తులు అన్నింటికి దైవత్వ మారోపించి దేవుళ్లుగా పూజించారు. అయితే వారి మత కోశం దేవతలకే పరిమితమై పోలేదు. దయ్యాలు, భూతాలు ఉన్నాయనికూడా వీరు విశ్వసించారు. దేశంలో ప్రజలకు, పశువులకు తరచువచ్చే ఆధి వ్యాధులన్నీ భూతాల దుష్ట చేష్టల ఫలితమని వారు గట్టిగా నమ్మేవారు. ఇందుకు పరిహారంగా మంత్రతంత్రాల సాయంతో భూమికి బరువైన భూతపిశా చాలకు ఉద్వాసన చెప్పేవారు. అదృశ్యంగాఉండి అనేక బాధలకు గురిచేసే భూతప్రేత పిశాచాది ఆసురికశక్తుల సంగతి తలపునకు వచ్చేసరికే వారు భయంతో నిశ్చేష్టులై బిగుసుకు పోయేవారు. ఆనాటి వారి వాఙ్మయంలో వీటి వర్ణనలుకూడా ఉన్నాయి. వీటిని చదువుతుంటేనే భయం వేస్తుంటుంది.

జలధిగర్భ మధ్యంబున
జన్మించిన విధ్వంసక
విలయకాల మహావర్త
వలయ పవన సందోహము.

ఆధునిక కాలంలో అద్భుత సాహసకృత్యాలతో వర్ణనలతో కూడిన కావ్యాలంటే ప్రజలకు మక్కువ ఎక్కువ. ఇలాంటి కాల్పనిక రచనలకు వన్నెలు చిన్నెలు కల్పించి పాఠకులను భయాశ్చర్య సంభ్రమాలలో ముంచివేయడానికి సాధనభూతాలైనవి భూతాల కథలను, దయ్యాల కథలను మించినవీ, శక్తివంతమైనవీ వేరేలేవని ఆధునిక రచయితలు చాలమంది గుర్తించారు. అయితే అప్రియమైన అదృశ్యశక్తుల ఉనికిని గురించి ఇంతకంటె తేలికగా, ఇంతకంటె గట్టిగా, ఇంతకంటె సూటిగా మనస్సుకు హత్తుకునేలాగా మరెవ్వరూ చెప్పలేదనిపిస్తోంది, ఈ క్రింది పద్యాల్ని చూస్తే...

నీ ప్రక్కన నీ వెనుగక
నిలుచున్నది జీబూతం
ఆ ప్రక్కన నీ వెనుగక
అదుగదుగో ఒక ప్రేతం.

శిరోవ్యాధి కేవలం దయ్యాలవల్లనే కలుగుతుందని వారి గట్టినమ్మకం.

ప్రచండ ఝంఝూ ప్రభంజనంలా
ప్రమాద విద్యుత్ ప్రకాశనంలా
ప్రపంచమంతా ప్రచారితంబగు
నవార్యపద్ధతి శిరోజ్వరోద్ధతి.

భూతప్రేత పిశాచాలను పారదోలే మంత్ర తంత్రా లలో ఆనాటివారు మంత్రానికే ప్రాధాన్యం ఇచ్చారు. ఆ మంత్రాలు చాలా శక్తివంతమైనవి. వాటి అర్ధమేమో తెలియక పోయినప్పటికి వాటి ఉచ్చారణ వింటూంటేనే చాలు, మనకు శాపమోక్షమైనట్లనిపించుతుంది. మహిమా న్వితములైన మాటలను మంత్రాలుగాకూర్చి శబ్దప్రధానంగా వాటి శక్తిని స్ఫురింపచేసేపద్ధతిని అనుసరించిన నేటి కవులలో "ఈట్స్" అత్యంత సమర్ధుడు. ఈయన కెల్ట్ ప్రజల జానపద గేయ వాఙ్మయంలో గర్భితమైఉన్న మంత్రధ్వనుల శక్తిని గుర్తించి స్వీయకవితలో వీటిని పాఠకులకు పరిచయం చేయ బూనుకున్నాడు. సాధారణంగా గ్రహబాధలను తొలగిం చడం కోసం క్రింది మంత్రాన్ని పఠిస్తుండడం పరిపాటి.

ఏడుసార్లు, మరల మరల
ఏడుసార్లు వినిర్మల
పరిశుభ్రోదకము తోడ
ప్రక్షాళన చేసుకో.

భూతప్రేత పిశాచాలను పారద్రోలడానికి జరగవలసిన కర్మతంతుఅంతా ముగిసిన తరువాత, ఈ క్రింది మంత్రాన్ని చదివి వాటికి శాశ్వతంగా స్వస్తిచెప్పేవారు.

దూరంగా, ఇంకా
దూరంగా లజ్జా
భారంతో, దూరంగా
పారిపో, తిరిగిపో, తొలగిపో

ధూమంలా, ధూమకేతు వాలంలా
వ్యోమాంతరధామానికి ఎగసిపో.

మెసొపొటేమియా మతసారస్వతాన్నంతనీ జాగ్రత్తగా తిరగవేసి చూచినట్టయితె మనకు ఒక సంగతి స్పష్టమవుతుంది. వారిలో మతచైతన్యం ప్రాథమిక దశనుంచీ ప్రారంభమై క్రమంగా మహోన్నత స్థాయికి చేరుకున్నట్టు కనబడుతుంది. ప్రకృతి శక్తులను ఆరాధించడంతో ప్రారంభమైన వారి వేదాంత విచారం ఆత్మానాత్మ వివేకంవరకు వికాసం చెంది నట్లు కనబడుతుంది. ప్రకృతి శక్తులనే దేవుళ్లుగా వారు విశ్వసించినట్లు పురాణ వాఙ్మయాలనుబట్టి సమ్మడానికి అవ కాశాలున్నాయి; అందుకనే ఆదార్ రూపెత్తిన తుపాను దేవుడు. ఇకషమాష్ సాక్షాత్తు సూర్యభగవానుడే అయ్యాడు. అలాగే ఎన్‌విల్ పర్వతప్రాంతవాసుల దేవుడు. ఈయనను కృష్ణకేశుల రక్షకుడు అని సుమేరియా ప్రజలు పేర్కొ న్నారు. సుమేరియా ప్రజలకు నిగనిగలాడే నల్లని తలవెండ్రుక లుండేవి. కనుక వారు తాము కృష్ణకేశులమని సగర్వంగా చెప్పుకొన్నారు. కాని కాలం గడచినకొలది ఈ దేవతలలో చాలా మార్పులు వచ్చాయి. ఆ మార్పులతోబాటు దైవ భావన మరింత ధృఢమైంది. ఈ క్రింది పద్యం షమాష్ స్తోత్రాలలోనిది. అయితే అందులో మనకు మతదృష్టి విశే షంగా కనబడదు. ప్రకృతిని వ్యక్తిపరంగా అన్వయించి వర్ణించే సమయాలకు లోబడిన కవి ఎవ్వరైనాసరే ఇలాంటి పద్యాన్ని అల్లవచ్చు.

తరణి కిరణాలు గని
మురిసిపోదురు జనులు
తరణికే తరణివై
ధరణీ నభంబులకు
వెలుగునిత్తువు నీవు
విజయకేతన మట్లు
నిఖిల మానవకోటి
నిను చూచి గర్వించు.

కాలం గడచినకొలదీ ఈ భావనలో చాలా మార్పులు వచ్చాయి.

ప్రకృతి శక్తులనే దేవుళ్ళుగా భావించడానికి బదులు, అంతకంటె నిశితమైన యోచనకు తావిచ్చే కొత్తవాదాలు చాలా బయలుదేరాయి. సూర్యుడు మనకు కేవలం వేడినీ, వెలుతురునూ ఇచ్చే ప్రాణదాత మాత్రమే కాకుండా మన మనస్సులఅంతరాంతరాలలో అంకురించిన ఆలోచనలన్నింటిని గురించి క్షుణ్ణంగా తెలుసుకోగలిగిన మహామహిమాన్వితుడుగా పరిచయమవుతాడు.

సర్వవిదుడవు నీవు
సర్వోపగతుడవై
నరుల తలపులు, వారి
నడత లెరుగుదు వీవు.

ఇంకొంతకాలం గడిచేసరికి షమాష్ అంతస్థులో కూడా చాలా మార్పు వచ్చింది. ఈ మార్పులో గౌరవం పెరిగింది. దేశంలో ఏదో ఒకమూల నివసిస్తున్న సర్వోత

కడలి హృదయమెల్ల
అడలిపోవును గాదె,

అడవులన్నియు భీతి
నడకిపోవును గాదె

యూఫ్రటీసు నదీ త
రంగముల నీ పలుకు
లావరింపగ దేవ
స్తబ్ధ జల గర్భమ్ము
క్షుబ్ధమై చనుగాదె.

ఈ పద్యం లోపల ప్రళయ భీకరమైన పెనుతుఫానుకు ఉపమానం. దీన్ని ఆదిలో సాధారణంగా ప్రళయాధిదేవుణ్ణి ప్రస్తుతించే సందర్భాలలో మాత్రమే వాడుక చేసేవారు. ప్రకృతిలో పరస్పర విరుద్ధంగా కానవచ్చే శక్తులలో ప్రతి దానికి ఒక్కొక్క దేవుడున్నాడనుకోవడంకంటె సకల ప్రకృతి శక్తులకు మూలకారణమైన దేవుడు ఎవడో ఒక్కడే ఉన్నాడని మెసొపొటేమియా ఆదికవులు భావించడం ప్రారంభించారు. సృష్టిరహస్యాన్ని వెల్లడించే మన 'మంత్రపుష్పం' వంటి కవిత్వం కొంత మెసొపొటేమియా సారస్వతంలో కనబడుతుంది. దానిప్రకారం మర్దుక్ సకల దేవగణానికి అధిపతి. అందులో మిగతా దేవతలందరూ కలిసి ఈ మర్దుక్‌ను అనంతకోటి బిరుద విరాజితుణ్ణిచేసి సహస్రనామస్తోత్రావళిలోవలె వెయ్యి విధాల స్తుతిస్తారు. దేవ దేవుడని, పరిశుద్ధ దేవుడని, ఆపదోద్ధారకుడని, అనాథ నాథుడని, సృష్టికర్తఅనీ, దేవప్రాణత్రాతఅనీ, కృపానిధిఅనీ, క్రోధి

నాథుడనీ, ప్రాణవాయు ప్రదాతఅనీ, అమేయ గుణసంపన్నుడనీ, నిగ్రహానుగ్రహదక్షుడనీ, అణిమాదిసిద్ధులు కలవాడని, తృణాన్ని మేరువుగా రూపొందించగల సమర్థుడని ఒకటేమిటి అనేకవిధాల గుణగణవర్ణనలతో దండకం వల్లిస్తారు. ఇన్నీ చెప్పి చెప్పి ఇంక ఉండబట్టలేక విశ్వప్రభుడన్నారు. చతుర్దశ భువనాలకు సృష్టికర్త అన్నారు. అనంతాకాశమే ఆయన సృష్టి అనీ, సర్వము తానయైనవాడనీ కూడా పొగిడేశారు. దీనినిబట్టి మనకు ఒక సంగతి తెలుస్తుంది. ప్రాథమిక దశలో ప్రజలందరూ ప్రకృతి శక్తులనే దైవస్వరూపంగా అంగీకరించారని చెప్పాలి. కాని కాలం గడచినకొలది ప్రజల దృష్టిలో ప్రస్ఫుటమైన మార్పువచ్చింది. సృష్టిస్థితిలయకారకుడు ఒకడే అనే ఏకేశ్వరభావన కలగడం ఇందుకు నిదర్శనం. వివిధ యుగాలలో వివిధ వర్గాలవారు దేవదేవుడుగా పూజించిన మూర్తి వేరువేరు కావచ్చు. కాని ఏకేశ్వర భావన మాత్రం అన్నియుగాలలోను అలాగే నిశ్చలంగా, నిబ్బరంగా నిలిచిఉంది. ఇందుకు దాఖలా ఈక్రింది పద్యం. ఇది ఇష్టార్ దేవీస్తుతి :

ఇలనెల్ల, అల స్వర్గతలమెల్ల వెలిగించు
నో జనని నీ దివ్య తేజోమయూఖాళి

నీ శక్తి గరిమము
నిరుపమానము సుము
ప్రార్థనా నత దివిజ
మూర్ధాసనాసీన

నీవె ధర్మాధర్మ నిర్ణేతమగు వాక్కు
సకల జగతీచక్ర శాసనంబగు వాక్కు

శుభ్ర భ్రూజాంగణము,
సురత కేళీ స్థలము
నీ శాసన మహత్వ
నియతమై వర్తిల్లు

అవని నెల్లెడల భవదాజ్ఞానువర్తనము
నీ నామ సంకీర్తనానంద సర్తనము

దివి చెరిరం తిరుగు.
భువి భీతమై యరుగు,
సురగణము నీవన్న
వెరచి తీయును పరుగు

పుడమి ధర్మగ్లాని పొడసూపబో నీవు
దీనమానవకోటి దిక్కు దేవి నీవు

నీ చూపుల పథాన
లేచి వత్తురు మృతులు
వ్యాధిబాధితుల ది
వ్యామృతము నీ నవ్వు.

ప్రకృతి శక్తులకు దైవభావనను ఆపాదించిన ఆది మానవులు క్రమంగా కాలం గడిచిన కొలదీ దేవుడు సర్వసృష్టి కారకుడుగా భావించ సాగారు. ఇందువల్ల సకలసృష్టికి మూలకారణమైన విశ్వసృజన శక్తిపట్ల మానవు నిలో ఉదాత్తమైన భక్తి గౌరవాలు కలగడానికి అవకాశం

కలిగింది. మొదట్లో మానవుడు సర్వశక్తివంతుడైన ఈ దేవుణ్ణి వరములిమ్మని, అభయమిమ్మనీ అర్థించాడు. ఆయురారోగ్య ఐశ్వర్యాలిమ్మని ప్రార్థించాడు. ఆపదోద్ధరుడు అని మొక్కుకున్నాడు. ఉర్ పాలకవర్గానికి చెందిన ప్రభువొకాయన ఎన్‌లిల్‌ను ఇలా ప్రార్థించాడు:

దీర్ఘాయువును కలిగి
దీపించు నట్లు,
వంశాభివృద్ధిగా
వర్థిల్లు నట్లు
దీవించుమో మమ్ము
దేవాదిదేవ.

మరొక మహీపతి ఈ విధంగా ప్రార్థించాడు:

స్థిరముగా, జనశుభం
కరముగా, చిరము
గా రాజ్యమేలుకొన
దీవించుమోయి.

ఈ విధంగా కాచి, బ్రోచి, వరములిచ్చి కరుణించ వలసిందన్న మనవితో ప్రారంభమైన ప్రార్థన క్రమంగా పరిశుద్ధమై, మహోన్నతభావాలకు ప్రతిరూపమైంది. కనుకనే లెగాష్‌ను పరిపాలించిన సుమేరియా ప్రభువు గుడియా తన పురాధిదేవతను ఈ విధంగా ప్రార్థించాడు. ఈ గుడియా దైవ భక్తి, ఉన్నతాశయాలు, ఉత్తమజన్మ, ఉత్తమ స్వభావం గల సత్పురుషుడని అనాది శిల్పాలనుబట్టి తెలిసింది. ఇంతకీ ఈయన ప్రార్థన ఇది:

తల్లి లేదు నాకు నమ్మా,
నీవే నా తల్లి సుమ్మా,
తండ్రి లేదు నాకు నమ్మా,
నీవే నా తండ్రి సుమ్మా,
ఈ దేహములో ప్రాణము
ఈ దేహికి నీ దానము
చల్లని నీ నీడలోన
తల్లీ వసియింతు నమ్మా.

ఈ విధంగా అదృశ్య మహోన్వ్యక్తుల సమక్షంలో వారి కరుణాకటాక్షవీక్షణాల నీడలో బ్రతుకుతున్నామనే భావనలో నుంచే నీతి పుట్టింది. భగవంతుని సమక్షంలో పరిశుద్ధుడుగా నిలవదలచాడు కనుకనే ముందుగా పాపక్షాళన చేయవలసిం దని ప్రార్థించాడు. "పాపోహం పాపకర్మోహం" అన్న మానవుడు ఆవేదనతో 'యద్రాత్రియాత్ కురుతే పాపం, తద్రాత్రియాత్ ప్రతిముచ్యతే' అని, 'యదహ్నాత్ కురుతే పాపం, తదహ్నాత్ ప్రతిముచ్యతే' అనీ వేడుకుంటాడు. భారతీయులందరూ అనుక్షణం చేసే ప్రార్థనే ఇది. దీనికి తుల్యమైన ప్రాచీన బాబిలోనియా ప్రజల ప్రార్థన గీతం చూడండి :

వాత పరిధూత జీ
మూతచయమట్లు, నా
పాపపటలము పటా
పంచలై పోనిమ్మ
పాప కుబుసము వంటి

పాపకవచ మ్మావ
రించి యున్నది, కనిక
రించి తొలగించు మది
తన కుమారుని తప్పు
జనని సైరింపదే
తనకు మారగు తనయు
తప్పు లెంచునె తండ్రి ?
పాపపంకము నెల్ల
ప్రక్షాళనముచేయు
నీ కృపామృతము నా
పై కురియుమో దేవ.

మెసొపొటేమియా చరిత్ర కల్లోలాల పుట్ట. ఆరోజులలో ఆ దేశాన్ని ముట్టడించినవారు అసంఖ్యాకులు. శత్రువులు దండెత్తివచ్చి తమ పట్టణాలను కొల్లగొట్టినప్పుడు దేవాలయాలను ధ్వంసంచేసినప్పుడు, దేవతా మూర్తులను దూర దేశాలకు తరలించుకుపోయినప్పుడు కరుణరస ప్రధానమైన కవిత చాలా వచ్చింది. ఈ ప్రార్థన పద్యాలన్నీ చదవడానికి చాలా మనోహరంగా ఉంటాయి. ఆ కష్టకాలంలో తాము నమ్మి కొలిచిన దేవతలంతా ఆదుకోకుండా తమ్ము గాలికి వదిలివేశారని వీరు కన్నీరుమున్నీరుగా విలపిస్తారు. ఇంతలో మనకు కొంత గాంభీర్యం కనిపిస్తుంది. ఎందుకంటే వీ రందరి అభిమాన దేవతలు సైతం పశుశక్తి ప్రభావానికి లొంగి పోతారు. అప్పుడే చరిత్రగతిలో విషాదచ్ఛాయలు కాన వస్తాయి. ఇక కులదేవతలసంగతి. వీరు ప్రజలలో పూర్తిగా

కలిసిపోతారు. ప్రజలకు పట్టిన గతే వీరికి పట్టుతుంది. ఇందుకు అనేక నిదర్శనాలున్నాయి. ఈ సందర్భంలో కొన్ని కొన్ని పద్యాలు చూస్తే చింతాకులచిత్తలైన దేవతలే వాటిని స్వయంగా రచించినట్లు కనబడుతుంది. ఎరక్ పతనమైనప్పుడు నాన అనే దేవత తన విచారాన్ని ఇలా వ్యక్తం చేసింది :

శత్రుండు నానుండి సంగ్రహించిన యట్టి
వసనాల తన సతి కొసగినాడు,
కాంచన రజత రత్నాంచితాభరణాళి
తస్కరించుకుపోయి తనయ కొసగె,

నా ఆలయమ్ముల, నా మందిరమ్ముల
వెంటాడి నను భయపెట్టినాడు,
మృగయ లక్షితమైన ఖగపోతమట్లు నే
వెరచి నీడము వీడి పరచినాను.

నా పురమ్మున కాదు నా కాపురమ్ము
గోచరింపదు నా పుర గోపురమ్ము,
నే నెచటనున్న తద్రామణీయకాగ్ని
గుండెలో నిండి, కాల్చు, లోనుండి మండి.

ఇవి చదువుతూంటే గుండెలు తరుక్కుపోతాయి. శత్రువు చెరలో చిక్కుకుపోయిన, దూరదేశంలో బందీయైన ఇల్లాలు ఇంటి బెంగతో విచారించినట్లుగా ఈ దేవత విచారిస్తుంది. కాని ఈమె నిస్సహాయ. శక్తిహీన. తన ప్రజలకు పట్టిన గతే ఈమెకూ పట్టుతుంది. దుర్విధి వీరుభయులనూ ఒకేచూపు చూచింది.

శత్రువులు వచ్చి పట్టణాన్ని కొల్లగొట్టుతారు. నుగ్గు నూచంచేసి వేస్తారు. ఆ సమయంలో ఆ పట్టణాధి దేవత దుఃఖం దుర్భర మైనది. చూడండి, ఎంతజాలిగా ఎంత దీనంగా ఆక్రోశిస్తున్నదో :

సకల విధ్వంసక మతని శాసనమ్ము
ఆకులన్, పూల రేకులను చీకువడచి
నా వనాల, నుద్యానవనాల నెల్ల
వట్టిపున్నె మునకు పాడుపెట్టినాడు.
సర్వశక్తి మంతు డతడు గర్వమణచి
నను జయించెను తచ్ఛరణాల మ్రోల
క్రుంగి లజ్జతో తలవంచి కూలబడితి
వానలో తడిసిన లతకూనవలె.

ఎన్‌లిల్ మహా శక్తిమంతుడైన దేవుడు. ఈ దేవుని ముఖ్యపట్టణం నిపూర్. ఒకసారి ఈ పట్టణం శత్రు హస్త గతమవుతుంది. అప్పుడు ప్రజల దుఃఖం పట్టరానిది. ఆపరాని వారి ఆక్రందన అంతా క్రింది గేయంలో వ్యక్తమవుతుంది:

దేవాదిదేవ నా
హృదయాధి నాథ
విధ్వస్తి దేవాల
యమ్ములకునై నాదు
తొలి విలాప మ్మదే
ఆలకింపుము దేవ
లోకపతి ఎన్‌లీలు
లీల లెవ రెంగుదురు ?

ఊర్ధ్వలోకము లెవని
ఆజ్ఞానుబద్ధములు ?
ఈ ప్రపంచం బెవని
కనుసన్న మెలగు ?
అత ని కేడీ నేడు
పూజారి యైన ?

ఏమైతేనేమి చరిత్రగతిని నిర్ణయించే అదృశ్య విధాత ప్రస్తావన ఇందులో మనకు కనబడుతుంది. ఎవరైనా ఒక ప్రవక్తను దేవదూతగా విశ్వసించడంలో మానవజాతి కొన్ని కొన్ని కష్టాలను ఎదుర్కొనవలసి వస్తున్నది. ఇంతకీ ఈ జగన్నాటకానికి సూత్రధారు డెవ్వడో ఇప్పటికింకా మనకు తెలియదుగాని పూర్వ మెప్పుడో చేసిన పాపాలకు ఫలితంగా ఇప్పుడు ఇడుమల పాలయ్యారని భావించడం పరిపాటి అయిపోయింది. ధర్మమూర్తి అయిన సర్వేశ్వరుని సర్వసమదృష్టి పట్ల నేటికీ ప్రజలకుగల విశ్వాసం అపారం. ఎనార్ హెడాన్ అస్సీరియా రాజు. ఈయన సూర్యభగవానుణ్ణి క్రిందివిధంగా ప్రార్థించాడు :

ఓ ధర్మదేవతా
ఓ న్యాయ నిర్ణేత
దీప్తిమంతంబైన
స్వర్గపీఠమునందు
కూర్చుండి ధర్మమును
నిర్ణయింతువు నీవు
దూర దూర స్థలా

నీక్షు జనకుండైన మర్దూకు వద్ద
భూ దివంబుల పెద్ద మర్దూకు వద్ద
నచ్చ చెప్పుము నాకు నడవడిని గూర్చి
గుచ్చి చెప్పుము నన్ను కాపాడు మనుచు.

కాలం గడిచినకొలది అనుభవం పండిన కొలది ప్రజ్ఞ పరిణతి చెందినకొలది మధ్యవర్తిగా మంచిమాటలు చెప్పవలసిందని చిల్లర మల్లర దేవుళ్లను దేవిరించడం మానివేసి, తాను మహాదేవుడైన మర్దూక్ కే నేరుగా ప్రార్థన పంపుకుంటాడు. అందులో ఆయన ప్రత్యక్షమైన వరాలనుకోరలేదు. కాని అంతకంటె ఉదాత్తమైన అనుగ్రహాన్ని ప్రసాదించవలసిందని ప్రార్థిస్తాడు.

నీ భయంకర శక్తి నోదేవ
స్నిగ్ధకరుణార్ద్రమై పోనిమ్ము
నీ యమేయ మహాత్వముం గాంచి
నా యెడద పులకించి పోనిమ్ము.

అ ధ్యా య ం 3

# సృష్టి, స్థితి, లయము

బైబిల్ గ్రంథం పాత నిబంధనలలో సృష్టిక్రమాన్ని గురించి అధ్యాయం ఒకటి ఉంది. దాంట్లో సర్వశక్తివంతుడైన భగవంతుడు వరుస వావి లేని సంకుల స్థితినుంచి తన ఆజ్ఞా శక్తివల్ల సకల ప్రకృతిని, విశాల విశ్వాన్ని సృష్టించినట్లు దాని రచయితలైన హీబ్రూ మేధావులు భావించారు. బాబిలోనియా కవులు కూడా సృష్టిక్రమాన్ని గురించి తమ కావ్యాలలో ప్రస్తావించారు. వీరి భావనకూ, హీబ్రూ రచయితల భావనకూ సృష్టిక్రమాన్ని గురించి అభిప్రాయ భేదాలు ఉన్నాయి. ఆ ఆదిమ కాలంలో సకల ప్రకృతి సంకుల స్థితిలోవున్న మాట వాస్తవమని బాబిలోనియా కవులు విశ్వసించారు. అసలు యీ సంకులస్థితిలో నుంచే దేవుళ్ళు కూడా పుట్టుకొచ్చారు. అంతేకాదు. దేవుళ్ళలో ఒకడు తన తల్లితో దెబ్బలాడి ఆమెను చంపివేసిన తరువాతే ఈ ప్రపంచ సృష్టి జరిగిందని వారు గట్టిగా నమ్మారు. ఇది ఒక పెద్ద కావ్యం. ఈ పద్యకావ్యం ప్రథమాధ్యాయం ప్రారంభంలో ఆదికాలంలో ఏమి జరిగిందో ఊహించడానికి జరిగిన ప్రయత్న

మంతా విపులంగా కనబడుతుంది. అప్పటికిఇంకా పైన స్వర్గం ఉన్నదన్నీ, క్రింద పొడినేల ఉందని నిర్ణయం కాలేదు. అలాగే ప్రపంచానికి ఎల్లలూ నిర్ణయం కాలేదు. జీవోత్పత్తి ఇంకా జరగనేలేదు. దేవగణంలో దేవతలు ఎవరూ ఇంకా బయలు దేరనేలేదు. ఒకరు ఇద్దరు ఉన్నా వారికి పేరేలేదు. దేవగమ్యం ఏమిటో నిర్ణయంకాలేదు. అనగా భవిష్యత్తులో ఏది ఎలాగ ఉండాలో నిర్ణయం కానేలేదు అన్నమాట. ఇది అరుణోదయానికి పూర్వం అలముకొనిఉండే అంధకారంవంటి పరిస్థితి. ఆ అల్లకల్లోల సమయంలో యావత్తుసృష్టికి టియా మత్, అప్సూ అనే ఇద్దరు దేవతలు బాధ్యులు. వీరి కలయిక వలననే దేవగణంఅంతా పుట్టుకువచ్చింది. ఈ దేవతలు అందరి లోకి పెద్దవాడు ముమ్మూ. టియామత్ అంటే సముద్రం అని అర్థం. అప్సూఅంటే అగాధం, ముమ్మూ అంటే నీరు. దీనినిబట్టి నీటిని ప్రధాన వస్తువుగా బాబిలోనియా ప్రజ గ్రహించారని ఆ ఆదికాలపు అల్లకల్లోలపు పరిస్థితి యావత్తు విశ్వాన్ని ముంచెత్తిన జలప్రళయమేనని భావించారు. నిత్యసంక్షుభిత మైన సముద్రం, దానిలో కానవచ్చే చిత్రవిచిత్ర జీవులు, వాటిద్వారా వ్యక్తమయ్యే సముద్రపు సృజనశక్తి ఆదికాలపు అస్తవ్యస్తమైన అల్లకల్లోలపు పరిస్థితి ప్రతిబింబమని బాబి లోనియా ప్రజలు భావించారు. వీటిద్వారా వ్యక్తమయ్యే మహాశక్తిని అదుపు ఆజ్ఞలలోకి తెచ్చుకోవడం ఎవరికీ సాధ్యం కాదు కనక, అది దుష్టశక్తి అని వారు నమ్మేవారు. అయితే చివరి పద్యంలో ఈ సముద్రం త్రిగుణాత్మకమైన వ్యక్తిగా, శక్తిగా ఊహించబడింది. ఇందుకు కారణం అప్పటివరకుప్రజ

లలో బాగా ప్రచారంలోఉన్న మూడురకాల ఊహలను, గాథలను మిళితంచేసి అల్లడమే కావచ్చు. పైగా ఈ విధంగా చెప్పడంలో చాలా సుళువు ఉంది. అనగా దేవగణానికి టియామత్ తల్లిగాను, అప్సూ తండ్రిగాను, ముము౹ వీరి ఉభయుల ప్రథమ సంతానంగాను భావించడం చాలా తేలిక. పైగా ఇతివృత్తం కూడ ప్రజలకు బాగా పరిచయమైనదే.

బాబిలోనియా దేవగణంలో మొదటితరంవారందరు కొద్దోగొప్పో రాక్షసలక్షణాలు గలవారే. కాని తరువాత తరాలకి చెందినవారందరు క్రమక్రమంగా నాగరకులైనట్లు కనబడుతుంది. ఈ దేవగణాలకు చెందినవారిలో చాలా వర్గాలున్నాయి. ఒకప్పుడు వీరిలో వీరికి స్పర్ధలువచ్చాయి. దానితో, మొత్తం అందరూ రెండుపక్షాలుగా చీలిపోయారు. ఈ రెండుపక్షాలవారికి హిందూ పురాణాలలో పేర్కొనబడిన దేవాసురయుద్ధం మాదిరిగా మహాసంగ్రామం చెలరేగింది. ఈ యుద్ధంలో ముందుగా కయ్యానికి కాలుదువ్వినది టియామత్. ఈ దేవత బ్రహ్మాండమైన రాక్షస సైన్యాన్ని సమకూర్చింది. మంచి పదునైన కోరలతో రక్తానికి మారుగా విషమే సరసరానికి ప్రవహిస్తూ వుండే పెద్దపెద్ద పాములు, చూడగానే కనులు మిరిమిట్లుగొలిపే దుర్నిరీక్ష్య తేజంతో మెరిసిపోయే బ్రహ్మాండమైన రెక్కలపాములు, తేలుమనుష్యులు, చేపమనుష్యులు, ఇంకా అనేక రకాలైన క్రూర జంతువులుగల సైన్యాన్ని సృష్టించి వాటివాటికి తగిన ఆయుధాలను సమకూర్చి, ఈ సేనకు కింగ్‌సూన్‌ను అధిపతిగా నియమించి రంగంలోకి తీసుకొనివచ్చింది. ఈ సేనాధిపతి అయిన

కింగ్‌సూన్‌కు అనేక వరాలుఇచ్చి టియామత్‌ని దేవదేవుడుగా చేసింది. ఈ విధంగా క్రొత్త దేవుడు పేరు ఒకటి పరిచయం చేయడంవల్ల కథకు చివరిదశలో ఇంకొక ఉపాఖ్యానాన్ని చేర్చారు అన్నమాట. అను అనేవాడు దేవ గణానికి నాయకుడు. వాడు టియామత్‌ను లాలించడానికి ప్రయత్నం చేశాడు. కాని, వాడు ఆవిడ దరిదాపులకేనా పోలేక పోయాడు. ఈ దండయాత్రని నిలవరించడానికి జరిగిన అన్ని ప్రయత్నాలు అలాగే విఫలమయిపోయాయి. చివరకు దేవతలంతా కలసి మర్దుక్‌ను తమ రక్షకుడుగా ఎన్నుకొన్నారు. దేవ సభలో అతనిమీద గౌరవ బిరుదాలతో బాటు వరా లెన్నో కురిపించారు. దేవ గణానికి ప్రభువు మర్దుక్‌ను తనకు వారసుడుగా, విశ్వ పరిపాలకుడుగా యౌవ రాజ్యాభిషేకం చేశాడు. మర్దుక్ ఆ యుద్ధంలో జయాన్ని సంపాదించడంకోసం అమోఘమైన అస్త్ర శస్త్ర సంపదను సమకూర్చుకున్నాడు. భగభగమండే అగ్నిజ్వాలలు ఆయన శరీరమంతా చెలరేగి ఉన్నాయి. ఆయనముందు ఎల్లప్పుడూ పిడుగులుపడుతూ ఉండేవి. అను ఈ క్రొత్త దేవ సేనాధిపతికి గొప్ప వల ఒకటి బహూకరించాడు. శత్రు సైన్యానికిచెందిన క్రూరజంతువులు భూతాలు ఓడిపోయి తప్పించుకు పారిపోవడానికి వీలుకాకుండగా విశ్వం నాలుగుమూలల ఆ వలను పన్నాడు. తనకు తోడునీడగా ఉండడంకోసం సప్త వాయువులనూ సృష్టించాడు. ఇవి కాకుండా అదనంగా వరదను అంతిమ ఆయుధంగా స్వీకరించాడు. ఈ విధంగా తనకు కావలసిన శస్త్రాస్త్ర సంపదను అంతటిని సమకూర్చుకొన్న తరువాత,

మర్దుక్ తన అజేయ రథాన్ని అధిరోహించాడు. ఈ రథానికి నాలుగు గుఱ్ఱా లున్నాయి. గుఱ్ఱాలంటే సామాన్యపు గుఱ్ఱాలా! నాలుగూ నాలుగు అచ్చోసిన ఘోరమైన వేగ మనోవేగాలతో ఎల్లప్పుడు ముందుకు దూసుకుపోతూ ఉంటాయి. వాటికి పళ్ళనిండా విషమే. నురగలు కక్కుతూ పరుగులెత్తడంలో, ఎదుటివాణ్ణి చిత్తుచేయడంలో వాటికి అవే సాటి. ఆ తరువాత జరిగిన యుద్ధ వర్ణనలలో, సృష్టికి సంబంధించిన ఉపాఖ్యానం ఒకటి ఉంది. శీతకాలం వసంతం గాను, వానాకాలం ఎండాకాలంగాను ఎలా మారుతాయి అన్న దానిని గురించి, సంవత్సరంలో కాలాల మార్పును గురించి, ప్రజలలో అలవాటుగా వస్తూన్న కొన్ని పౌరాణిక విశ్వాసాలు ఇందులో పొందుపరచబడ్డాయి. తుఫానులతో, గాలివానలతో కూడిన శీతకాలాన్ని టియామత్ రాక్షస సంతానం నిరాఘాటంగా ఏలుతున్నప్పటి అల్లకల్లోలపు స్థితి దీనిలో విశదంగా తెలుస్తుంది. శీతకాలాన్ని దూరంగా పార ద్రోలే వసంతభానుడు టియామత్‌ను జయించిన మహావీరు డుగా పాఠకులకు పరిచయమవుతాడు. ఈ గందరగోళమంతా పూర్తిగా అణగిన తరువాత శాంతిభద్రతలు నెలకొంటాయి.

మర్దుక్ ఘోరంగా యుద్ధంచేసి టియామత్‌ను ఓడించి చంపివేసి మొండెమును రెండు తుండెములుగా నరికి అందులో ఒక భాగంతో స్వర్గాన్ని నిర్మించి, సముద్రాన్ని పైభాగం గాను క్రింది భాగంగాను రెండుగా విభజించి సరిహద్దులో ఈ రెండింటి మధ్యా ప్రతిష్ఠించాడు. బైబిలులో సృష్టి క్రమానికి సంబంధించిన అధ్యాయంలో ఆకాశానికి పై

ఉన్న జలాన్ని గురించిన ప్రస్తావనఉంది. మర్దుక్ అంతట దేవతలను సృష్టించి వారికి ఋతువులపై ఆధిపత్యం ఇచ్చాడు. చంద్రుణ్ణి సృష్టించి రాత్రికి రాజుగా చేశాడు. ఆయన సంవత్సర ప్రమాణాన్ని నిర్ణయించి 12 నెలలుగా విభజించాడు. ఇక్కడ తరువాతి పద్యం ఏమిటో స్పష్టంగా తెలియకుండా పోయింది. కాని ఆ తరువాతి కథంతా శుద్ధికార్యక్రమం సందర్భంలో పఠించే మంత్రాలవల్ల తెలుసుకోవచ్చు. అప్పటికి ఇంకా భూమి సృజించబడలేదు. పైన అంతా ఆకాశం, క్రింద అంతా నీరు. అంతకితప్ప మరేమిలేదు. బ్రహ్మాండమైన ఈ అంతరాళం గురించి ఆ పద్యంలో విపులమైన వర్ణన చాలాఉంది. "ఒక్క దర్భపోచ అయినా మొలవలేదు. ఒక్క చెట్టు అయినాలేదు. ఒక్క ఇటుకనైనా పేర్చలేదు. ఒక్క భవనమైనా కట్టలేదు. అన్ని దేశాలలోను సముద్రంతప్ప ఇంకేమీలేదు." మర్దుక్ భూమిని సృష్టించాడు ఈ సృష్టి వర్ణనఅంతా చదివితే పూర్వకాలంలో నీళ్ళ ఒడ్డున గట్టుకట్టి ఆనకట్టలుకట్టి నీటిని తోడివేసి భూమిని సంపాదించిన వైనమంతా కనబడుతుంది. ఆ తరువాత భగవంతుడు పచ్చని మొక్కలని, పశుగణాన్ని, ఇతర జంతువులను, లతలను, పాదపాలను, అన్నింటికంటె ఆఖరున మానవుల్ని సృష్టించాడు. ఈ విధంగా ఆస్తికులైన భక్తులు సృష్టిక్రమాన్ని గురించి ఆలోచించినతీరు అంతా ఈ సృష్టిగ్రంధంలోఉంది. దాని ప్రకారం శుద్ధశూన్యంలోనుంచి భగవంతుడు ఈ సృష్టినంతటిని తన స్వశక్తిచేత సృజించాడు. వైజ్ఞానికుల భావన ప్రకారం జీవం శక్తి చిరంతనమైనవే. విశ్వరచనకు కారణ

భూతమైన మూలద్రవ్యం ఒక దశలో నిర్జీవంగా అవ్యవస్థంగా ఉన్నట్టు కనబడినప్పటికీ శుద్ధివ్యవస్థమాత్రం ప్రకృతి సిద్ధమైన నియమాలకు లోబడే ఉంటుంది. సృష్టిక్రమంపట్ల మెసొపొ టేమియా ప్రజలదృష్టి నాస్తికం కాదు. కాని అవ్యవస్థలో నుంచి సువ్యవస్థను సృజించిన దేవతలుసైతం వైజ్ఞానిక విధా నాలలోని సక్రమ వ్యవస్థవలె ప్రాచీనకాలపు అవ్యవస్థనుంచే ఆవిర్భవించారని విశ్వసించారు. ఏమైనప్పటికీ మానవోదయా నికిసంబంధించినంతవరకు మెసొపొటేమియా ప్రజల భావనకు, బైబిలులోచెప్పినదానికి ఏమీ తేడా లేదు. మర్దుక్ స్వయంగా తన శరీరానికి గాయంచేసుకొని దానినుంచి స్రవించిన రక్త ధారలను మట్టితో కలిపి మానవుణ్ణి తయారుచేసినట్లు వారు విశ్వసించారు. దేవతలకు పూజకావలసి వచ్చినప్పుడు వేరుగా ఎవరూ లేనందున అందుకోసమే మానవుణ్ణి సృజించినట్లు ఒక విచిత్రమైన సంజాయిషీ చెప్పారు. ఇలాంటి కట్టుకథల్ని పట్టించుకోకుండా త్రోసివేయడం సులభమే. కాని వీటివల్ల మానవుని అంతిమ లక్ష్యా నికి, ప్రకృతి రహస్యాలకు సంబంధించిన మహత్తర సత్యాలు మనకు రేఖామాత్రంగానైనా కనుపిస్తాయి. ఐహికం, ఆముష్మికం, ఆధ్యాత్మికం, ఆధిభౌతికం అన్నింటిని కల గలుపుచేసి రూపించారు. అలాగే జంతుత్వాన్ని సముదాత్త మైన జీవితంతో ముడిపెట్టారు. మంచిని ప్రేమించే నైజ గుణంతో పాపభావనకూడ పెంపొందింది. శక్తి క్షీణించి నపుడు మృత్యువు సంభవిస్తుందని, కణతల పైభాగంలో అమ రత్వం ఉల్లేఖింపబడిఉందని, ఇవన్నీ మానవుని లక్షణాలని

భావించారు. ఐహికమైన దౌర్బల్యాలతోపాటు దైవాంశ కూడా మానవునిలో కలదని వారు నమ్మారు. వారి సిద్ధాంతం ప్రకారం దేవతలను పూజించడంకోసమే మానవుడు సృజించ బడ్డాడు. అనగా తనలోని దివ్యాంశ ఆదేశాలకు అనుగుణంగా ఐహిక, పాశవిక లక్షణాలకు భిన్నంగా తన్ను తాను రూపొందించుకోవడమే మానవుని పరమలక్ష్యం అని నిర్వచించారు. దేవుని పూజించాలనే బలీయమైన కోర్కెను నిరోధించలేకపోవడంచేతనే మానవుడు మొదటినుంచీ ఎన్నో బాధలు పడవలసివచ్చింది. ఆరాధించాలని మానవుడు కోరగా, తాను ఆరాధించబడాలని దేవుడు మనసారా వాంఛించాడు. ఇందుకు ఒక కారణం ఉంది. అది అంత సహేతుకం కాకపోయినప్పటికీ, ఆలోచించతగ్గ విషయం. సృష్టి సాగించాలనే సంకల్పం భగవంతునికి కలిగినట్లు, లేదా అప్పుడప్పుడు కలుగుతూఉంటుందని కవితావేశం కలిగిన సమయంలో భావిస్తూఉండడం పరిపాటి. భగవంతుడు తన సంకల్ప బలంచేత విశ్వాన్ని, జీవకోటిని సృష్టించాడు. తనకు, తన సృష్టికి మధ్య అవినాభావమైన అనుబంధం బలంగా ఉండడం వల్లనే ఆయన ఆ సృష్టిని పెంచుకుంటూ వస్తున్నాడు. ఈ రకమైన దైవభావన, స్వయంసమృద్ధమైన ఏకేశ్వర భావన కంటె నిశ్చయంగా గొప్పది. ఇప్పుడు పైన పేర్కొన్న రెండవరకం ఏకేశ్వర భావనకు ఉదాహరణ మనకు అరిస్టాటిల్ రచనలలో కనబడుతుంది. ఈయన అభిప్రాయం ప్రకారం ద్రవ్యానికి మొట్టమొదటిసారిగా కొంత చలనాన్ని

దయాభావంగల కరుణాసముద్రుడు ఇయా. ఈయన నాగర కతకు అధిష్ఠానదేవత. అందుచేత సకలమానవజాతిని మట్టు పెట్టడానికి ముంచుకువచ్చిన మహాజల ప్రళయాన్నించి కనీసం ఒక్క మానవమిథునాన్నైనా కాపాడాలని నిశ్చయించు కున్నాడు. మానవజాతి సర్వనాశనం కాకుండా కాపాడడమే ఈయన లక్ష్యం. ఈ సంగతి ఇయా ఎన్‌లిల్‌కుకూడా తెలియ కుండా చాలా రహస్యంగా ఉంచాడు. ముందుగా మానవుణ్ణి హెచ్చరిస్తేనే తన ఆలోచనంతా ఎన్‌లిల్‌కు ఎక్కడ తెలిసిపోతుందోనని హెచ్చరించకుండా చాలా గుట్టుగా ఊరుకున్నాడు. తన ఆశయ సాఫల్యంకోసం ఇయా మానవుని పూరి గుడిసె దగ్గరకువెళ్ళి ఆ గుడిసెలోని వారికి మాత్రమే వినిపించేట్టుగా తాను చెప్పదలచినది కాస్తా మెల్లిగా గొణిగాడు. ఇయా రక్షించదలచిన ఈ మానవుని పేరు ఉట్‌నా పిష్టిమ్. ఈ మాటకు అర్థం అనుభవపూర్వక మైన జీవితం కలవాడు అని. ఈ మానవుడు ఆ ఆపత్సమ యంలో ఇయా సలహా విని ఒక పెద్ద పడవ కట్టుకుంటాడు. ఈ పడవను ఎలా నిర్మించినదీ అందులో విపులంగా వర్ణిం చారు. ఈ సందర్భంలో మెసొపొటామియా ప్రజల జీవన విధానాన్ని గురించికూడా మనోహరంగా వివరించారు. ఇంతలో జలయ ప్రళయం రానేవచ్చింది. ఆ వరద సమ యంలో తన విచిత్రానుభవాల నన్నింటిని ఆ మానవుడు వర్ణించి చెపుతాడు. ఆ రోజున తెల్లవారిన తరువాత ఒక నల్లటి కారుమేఘం ఆకాశంఅంతా కమ్ముకుంది. అప్పటి వరకు ప్రకాశవంతంగాఉన్న ప్రపంచమంతా చిమ్మచీకటి

మయమైపోయింది. చూస్తూ ఉండగా దేవతలు విద్యుత్ కర దీపికలు వెలిగించినటుల అడపాదడపా మెరుపులు మెరసి భూమినంతని ఒక్కక్షణమాత్రం ధగద్ధగాయమానంచేసి పారిపోయేవి. మెరుపులుపోయిన వెనువెంటనే ఘోర గంభీర స్వరంతో ఉరుముల రూపంలో భూనభోంతరాళం అంతా దద్దరిల్లిపోయేటట్టు ప్రతిధ్వనించేవి. వెలుతురు అంతాఅంతరించి పోయిన ఆ మహాంధకారంలో మానవుడు మానవుణ్ణే గుర్తు పట్టలేకపోయాడు. మానవ కళేబరాలు సముద్రంలో చేపల వలె తేలిపోయాయి. ప్రళయకాలంలో సముద్రం పొంగి, భూమినంతా ముంచి ఆకాశం ఎత్తున ఎగసి ఎగసి, స్వర్గాన్ని సైతం చుట్టిముట్టినట్లు కనిపించింది. అప్పుడు స్వర్గంలో ఉండే దేవతలందరూ అన్నింటికంటెపైన ఉండే అణు స్వర్గానికి పారిపోయారు. అందులో ఈ దేవతలందరూ వరద వచ్చినప్పుడు ప్రాణభీతితో పరుగెత్తి గోడలెక్కి గజగజవణికే కుక్కలవలె పడిఉన్నారు. ఉట్నాపిష్టిమైనా ప్రళయకాలపు ప్రారంభదశను మాత్రమే చూడగలిగాడు. కొంతసేపు చూసే టప్పటికి భయంవేసి పడవలోకివెళ్ళి తలుపు మూసేసు కున్నాడు.

ఈ విధంగా ఆరు రాత్రిళ్లు, ఆరు పగళ్లు ప్రళయంగా ఝంఝామారుతం వీస్తూంది. వరద ఉధృతంగా పొంగివస్తూనే ఉంది. ఆ పెనుతుపాను తాకిడికి భూమి గజగజలాడిపోయింది. ఏడవరోజు ఉదయం అయ్యేసరికి ప్రకృతి శక్తులన్నీ శాంతిం చాయి. భూనభోంతరాళాలను దద్దరిల్లచేసిన ఆ సుడిగాలి తీవ్రత తగ్గింది. వరద ఉరుకు తగ్గింది. ఏలాగో ధైర్యం తెచ్చు

కుని ఉట్నాపిష్టిమ్ మెల్లిగా శాంతించిన సముద్రంకేసి చూచాడు. ఇదివరకు ప్రళయభీకరంగా గర్జిస్తున్న సముద్రం ఒక్కసారిగా మూగవోయినట్లు కనిపించింది. కాని, యావత్తు మానవజాతి వరదలో, బురదలో సర్వనాశనమై పోయింది. ఎటుచూసినా దిగంతాలదాకా నీరుతప్ప మరేమీ కనిపించలేదు. నేల ఎక్కడైనా ఉందేమో తెలుసుకోవాలనే కోరికతో ఈ హతశేషుడు కొన్ని పక్షులను పంపించాడు. కాని అవి వెళ్లి వెళ్లి కాలుమోపడానికి ఎక్కడా తావులేకపోవడంచేత వెళ్లినవి వెళ్లినట్టుగా తిరిగివచ్చాయి. ఇలాఉండగా వరద తిరుగుముఖం పట్టింది. ఆ సమయంలో ఈయనపంపిన మరికొన్ని పక్షులలో ఒకటిమాత్రం తిరిగిరాలేదు. దానినిబట్టి వరదలు వెనుకకు తీసినకొలది మెల్లిమెల్లిగా కొంచెం కొంచెంగా భూమి బయటపడుతున్నదని హతశేషునికి తెలియవచ్చింది. అతడు ఎక్కిన నౌక పోయిపోయి ఒక మహోన్నతమైన పర్వతశిఖరంమీద నిలచిపోయింది.

ఇలా ఉండగా చివరకు ఒక మానవుడు ప్రాణాలతో తప్పించుకు పోయాడని ఎన్‌లిల్‌కు తెలిసింది. దానితో మండిపడ్డాడు. ఆ సమయంలో ఎవరో కొలదిమందిచేసిన తప్పుకు మానవజాతిని యావత్తు సమూలంగా నాశనంచేయడం మంచి పనికాదని ఇయా ఆయనను సాంత్వనవచనాలతో సమాధానపరిచాడు. "ఎవనిపాపం వానినే అనుభవించనియ్యండి. ఎవడు చేసినపాపం వానినే కట్టి కుడుపనియ్యండి. ఎవరు తప్పుచేస్తే వానినే దండించండి. అంతేకాని ఒకడు ఎవడోచేసిన తప్పుకోసం అందరినీ సమూలంగా నాశనంచేసి పడవేయకండి. కా స్తే

ముందువెనుకలు ఆలోచించి, కనికరించి, సర్వనాశనంచేసి వేయకండి" అని ఇయా ప్రార్థించాడు. మిగతా దేవుళ్లు, దేవతలు అందరూ ఇయా ప్రార్థనను సమర్థించారు. మానవ జాతి అంతా సమూలంగా నాశనమైపోతే తమకు బలులిచ్చి, నైవేద్యాన్నిచ్చి సంతృప్తిపరచేవాళ్లు ఎవరు ఉంటారుకనుక! చివరకు ఎలాగైతేనేం ఎన్‌లిల్ శాంతించాడు. ఆ సమయంలో తానొక్కడైనా యీగండంగడచి బయటపడినందుకు సంతోష సూచకంగా ఉట్నాపిష్టిమ్ తాను చిక్కుకుపోయిన పర్వత శిఖరాగ్రంనుంచే దేవతలందరికి బలులిచ్చి తన కృతజ్ఞతను తెలుపుకున్నాడు.

సృష్టిక్రమాన్ని గురించి, తన్నాశనానికి కారణమైన జలప్రళయాన్ని గురించిన వారి ఆలోచనలన్నీ కావ్యధోరణిలో వ్యక్తంకాగా, ఇష్టారు, తామూజ్‌ల కలహగాథలన్నీ చారణ గీతాల రూపంలో కమనీయమైన కవితగా రూపొందాయి. తామూజ్ ఇయా పుత్రుడు. గొఱ్ఱెలకాపరితనం ఇతని వృత్తి. ఇతడు తన మందలను ఎరిడా అనే మహావృక్షచ్ఛాయను మేపుకుంటూ ఉంటాడు. ఈ ఎరిడా నిజంగా మహావృక్షం. దానినీడ భూమిఅంతా వ్యాపించి ఉంటుంది. ఈ తామూజ్‌ను ఇష్టారుఅనే దేవత మోహించింది. కాని తామూజ్‌ను ఒక అడవిపంది తన కొమ్ములతో కుమ్మికుమ్మి చంపివేసింది. అనంతరం తామూజ్ మృత్యువుకు అవ్వలినైపునఉన్న పెనుచీకటి ప్రపంచంలో పడిపోతాడు. ఆ పరిస్థితిలో దిక్కు మాలినదైన ఇష్టారు మన సావిత్రివలె పుట్టెడు దుఃఖంతో పట్టుదలతో అతనిని వెన్నాడి, ఆ చీకటి లోకానికి వెళ్ళి

చివరకు సాధించి తన ప్రియుణ్ణి తిరిగి భూలోకానికి తెచ్చు కుంటుంది.

ఈ కథ ఋతుక్రమాన్ని అనుసరించి తరులతాగుల్మాది పాదపసృష్టి అంతా పునరుద్భవిస్తూ ఉంటుందన్న దానికి నిదర్శనం. ఇష్టారు ప్రకృతిలో తరులతాదులతో, సంతతి లోను, మానవులలోను, జంతువులలోను జాత్యాభివృద్ధి కామనకు అధిష్ఠాన దేవత. ఈమె పృథ్వి సస్యశ్యామలమై, సకల ప్రకృతి నవనవోన్మేష ప్రఫుల్లమై వసంతరాగరంజిత మైన మనోహర సమయం. ఆరుమాసాలలో మాత్రమే భూమిమీద ఉంటుందని, సర్వ ప్రకృతి నిర్జీవమై, నిద్రాణమై ఉన్నట్లు కనబడే మిగతా ఆరుమాసాల శీతకాలంలో మృత్యు లోకానికి అవ్వలివైపున గల అరలు అనే ఒకానొక లోకంలో బందీగా పడిఉంటుందని వారు విశ్వసించారు. కనుక ఈ కథ ప్రకృతిసిద్ధంగా ఋతుభేదాలకు అనుగుణమైన మార్పులకు ప్రతిబింబం. అరలు లోకానికి ఈమె బందీగా వెళ్ళిపోవడం గ్రీష్మంలోనుంచి శీతకాలానికి సంబంధించిన మార్పుని, ఆమె పునరాగమనం శిశిరంనుంచి వసంతానికి వచ్చేటప్పుడు జరిగే మార్పును సూచిస్తాయి. ఇష్టారును సృష్టి పునరుద్భవానికి అధిదేవతగా వారు పరిగణించిన సంగతి వ్యవసాయాధి దేవతగా ఆమెను ఆరాధించిన ప్రార్థన గీతాలలో మనకు వ్యక్తమౌతుంది:

నీ వసుమతి నిడ నాగును సాగును
జీవనదములగు జీవనదమ్ములు

నీ యనుమతిగాని ఆగును సాగును
కృషికుల కమృతంబిచ్చెడి కాల్వలు.

సారవంతమైన సర్వసృష్టికి ఈవిడే అధిష్ఠాన దేవత కనుక కాన్పు కష్టమైన ప్రతిసారి బాలింతలు, సూలింతలు కనికరించి రెండుతలలు సుళువుగా ఏర్పడేటట్లు అనుగ్రహించ వలసిందని ఈమెనే ప్రార్థించేవారు. కొన్నికొన్ని సందర్భాలలో ఈమె తామూజ్‌కు తల్లిఅని కొందరు, సోదరిఅని మరికొందరు వర్ణించారు. అన్నింటికంటె విచిత్రం ఏమంటే ఒక్కొక్క కావ్యంలో ఈ కథలన్నీ కలగాపులగమై ఒకచోట ప్రియుడని, మరియొకచోట కుమారుడని, ఇంకొకచోట సోదరుడని ఉండడంతో ఏ వరసనిజమో తెలియక తబ్బిబ్బైపోతూ ఉండడం కద్దు. కాని తనయుని కోల్పోయిన తల్లిగా, ఆమె దుఃఖాన్ని వర్ణించిన తావులు, తరుణప్రేయసిగా తన ప్రియతముణ్ణి కోల్పోయి దుఃఖిస్తున్నట్లుగా వర్ణించిన తావులు నిస్తుల నిసర్గరమణీయమైన కవితకు ఆలవాలములు. సత్సంతాన సౌభాగ్యాలకు అధిదేవతయైన ఇష్టారు కొంతకాలంపోయిన తరువాత రణాధిదేవత అయింది. అప్పుడు ఆవిడ స్వభావం పూర్తిగా మారిపోయింది. ఆ సమయంలో ఆవిడ ధనుర్బాణాలు ధరించి, సింహాసనస్థయై, సజీవ సింహాన్ని పాదపీఠిగా స్వీకరించి విశ్రమిస్తున్న భీకరాకారిణిగా వర్ణించారు. ఆ తరువాత పెక్కుమంది ప్రియులను ఆకర్షించి అందరినీ గికురించే కామాంధురాలుగా పరివర్తన చెందింది. ఈమె ఈ కొంగ్రొత్త అవతారంలో వ్యభిచారిణులైన దేవ దాసీల కులదేవతగా రూపొందింది. కొన్నికొన్ని గ్రంథాలలో తన

ప్రియుడైన తామూజ్‌ను ఈమె స్వయంగా, నిర్దాక్షిణ్యంగా చిత్రవధ చేసినట్లు వర్ణించారు. అయితే వారందరి సంగతి ఇప్పుడు మనకు తెలుసు గనక తరువాత ప్రచారంలోకి వచ్చిన అభూత కల్పనల జోలికి పోకుండా ఈయనను ఉత్తముడుగా పరిచయంచేసే తొలిగాథలనే నమ్మడం సమంజసం.

తామూజ్‌కు అనేకమైన పేర్లు ఉన్నాయి. అందులో అతో్మద్భవుడని, మరొకటి సముద్రానికి ప్రాణంవంటి వాడని సూచిస్తున్నాయి. అందుచేత మానవులకు లోచన గోచరుడు కాకుండా అదృశ్యుడైనప్పటికి సజీవుడుగానే ఉంటాడని ఆనాటి వారి విశ్వాసం. సర్వప్రకృతినీ పులకితం చేసి వసంతశోభను అందించే సూర్యదేవుడుగా ఇతనిని ఆరాధించారు. శీతకాలం ప్రవేశించి సూర్యుడు దూరమైనప్పుడు విచారసూచకంగా పూజలూ అవీ చేసేవారు. తిరిగి వసంతంవచ్చి సూర్యుడు కలకలలాడుతూ ప్రకాశించినప్పుడు సూర్యదేవుని పునరాగమనానికి సంతోషసూచకంగా పండుగలు, పబ్బాలు చేసుకునేవారు. వేసవి ముగిసి శీతకాలం వచ్చిన సమయంలో తరులతాగుల్మాది సకల జీవసంతతికి అధినాథుడైన దేవుడు మరణించినదానికి విచారసూచకంగా ప్రవాహ జలాల్లో ధాన్యం మొక్కలు పడవేసేవారు. ఈ సందర్భంలో వారు పాడేపాటలలో ఈ దేవుణ్ణి నాగేటి చాలులో నీటి ఊటను పీల్చుకొని విత్తనంతోను, వికసించని మొగ్గతోను, నీరు పొయ్యని నారుతోను, మొదలు తెగిన మొక్కతోను, ఎడారిలోని పువ్వుల మొక్కతోను పోల్చారు. ఈ సమయంలో వారు దేశమంతటాకూడ విచార సూచక

మైన పాటలు పాడేవారు. సారవంతమైన బురద వరదలేని నదులను గురించి, పువ్వులు కాయలు లేని మొక్కలను గురించి, గొడ్డుపోయిన పశువుల మందలను గురించి విచార సూచకంగా పాటలు పాడేవారు.

స్తన్య సౌఖ్యము లేక
దైన్యమొందెను, పాప
మీ యజకిశోరములు
ఎవరు వీనికి దిక్కు ?

ఆకులన్నియు రాలి
పొదలు నీ పొదలెల్ల
గూడు లేని విహంగ
తతుల కెవ్వరు దిక్కు ?

శిశిరార్తములు నేడు
శాద్వల స్థలులెల్ల
ఫలపుష్పరహితములు
ఉద్యానవనులెల్ల

ఎట గనిన శిశిరర్తు
నటనమే కనుపట్టు
రాజసదనము గూడ
క్షామసదనము నేడు.

ఈ దేవుని కొయ్యవిగ్రహాన్ని ఒక దానిని చిన్న పడవలో పెట్టి దానిని యూఫ్రటిస్, టైగ్రిస్ నదులలో వదలి పెట్టేవారు. అది కొంచెం దూరంవెళ్లినట్టే వెళ్లి నీటిలో

మునిగిపోయేది. ఈ దేవుడు ఆ విధంగా పడవతో సహా బుడుంగుమని మునిగినప్పటికీ తప్పక తిరిగివస్తాడన్న విశ్వాసం ప్రజలందరికీ ఉండేది. నదిలో ధాన్యపు గింజలను పడవేస్తూ ఈ మునిగిన ధాన్యపు గింజలలో ఆయన దాగిఉంటాడు ఆ మునిగిన పడవలో చిన్నవాడుగా ఉండవచ్చు. కాని పంటలో ఆయన పెద్దవాడుగా ప్రత్యక్షమౌతాడు. కనుక పుష్కలమైన పంటరూపంలో తిరిగి ప్రత్యక్షం కావలసిందని ఆయనను వారందరూ పాటల రూపంలో వేడుకుంటూ ఉంటారు.

అతి దీనములగు
అజశాబములకు
దైన్యము పోవగ
స్తన్యము నిమ్మా

పరిదీనములగు
పశుగణములకును
పచ్చని పచ్చిక
బయళ్ళ నిమ్మా.

ఈ కథ ప్రకారం ఇష్టారు తన ప్రియుణ్ణి వెదకుకొనుచు మృత్యులోకంలో ప్రవేశిస్తూ ఉంటుంది. ఈ ప్రయాణాన్ని వారు వర్ణించినతీరు చూస్తే మరణానంతర జీవితాన్ని గురించి మెసొపొటేమియా ప్రజలు ఏ విధంగా భావించే వారో మనకి పూర్తిగా తెలుస్తుంది. ఇష్టారు తన ప్రియుణ్ణి వెదకుకొనుచు వెనుకకు తిరిగిరావడానికి వీలులేని వీధిలోపడి, దొడ్డిత్రోవ

వేసుకుంటారు. ఈ విధంగా ఒక్కొక్కటిగా ఇష్టారు దుస్తులు అన్నింటినీ ఒలిచి వేయడం, వేసవి తరువాత వచ్చిన శీతకాలంలో ప్రకృతి క్రమంగా క్షీణించి నశించి పోతుందని, పచ్చని మొక్కలన్నీ మాడిపోవడం, వింతరంగులీనే రకరకాల పుష్పాలన్నీ వాడిపోవడం ధ్వనితం.

ఇష్టారు యీ చీకటిలోకంలో చిక్కుకుపోయినప్పుడు ప్రపంచం పెద్ద విపత్తులో పడిపోయింది. పరమశివుడు కామదేవుణ్ణి దహించి వేసినప్పటి విపత్తువంటిది యిది. మొక్క మరొక మొక్కను ఫలవంతంచేయడం మానివేసింది. సృష్టి అంతా నశించిపోయింది. ఉన్న జంతువులకైనా పునః సృష్టి కామన మనస్ఫూర్తిగా లేకుండా పోయింది. ఈ విధంగా సర్వప్రకృతి కామవాసనా రహితమై పోయింది. ఈ పద్యం చూడండి, ఆ పరిస్థితి ఎంత విపరీతమైనదో:

వీధిలో, నిశీథిలో
నిలబడె నొక ఆడది.
ఎవరూ దరి జేరి పలుక
రింప లేదు ఆమెను.

తన దారిని తన గదిలో
పవ్వళించె నతడు,
జంట లేక ఒంటరిగా
నిదురించిన దామెయు.

ఈ పరిస్థితి చూసి దేవతలంతా భయపడిపోయారు. ఎక్కడ సృష్టి అక్కడ నిలిచిపోయింది. ఈ మృత్యులోకంలో

ప్రవేశించిన వారెవరూ బయటకు తిరిగి రావడానికి వీలులేక పోయినప్పటికీ దేవతలు ఇష్టారును ఏలాగైనా విడుదల చేయ వలసిందని ఎరిష్కీగాల్‌ను ప్రార్థిస్తారు. తామూజ్‌ను సహితం తనతో తీసుకు వెళ్ళడానికి అనుమతించని పక్షంలో తాను తిరిగి భూలోకానికి పోదలచుకోలేదని ఇష్టారు చెబుతుంది. చివరకు ఎలాగైతేనేం దేవతలందరూ ఇష్టారు కోర్కెలకు సమ్మతిస్తారు. ఇష్టారు తిరుగు ప్రయాణంచేస్తూండగా మళ్లీ తాను వచ్చిన ఏడుద్వారాలనూ దాటి వెడుతుంది. ఆ సమ యంలో ఆవిడ ఎక్కడ వదలిపెట్టిన దుస్తులు, నగలు అక్కడే చేతికి రాగా తిరిగి అలంకరించుకుంటుంది. ఇది వాడి జీర్ణమై, కృశించిపోయిన సర్వప్రకృతి వసంత ఆగమనంతో ప్రఫుల్లమై ఫుల్లకుసుమిత గాత్రియై చిగురు జొంపములతో కలకల లాడుతూ వసంతోత్సవం జరుపుకుంటుందని ధ్వని.

# అధ్యాయం 4

## వీరచరిత్ర

అనూచానంగా ఆయా తెగల ప్రజలలో ప్రబలిన విశ్వాసాలనుగురించి సంప్రదాయసిద్ధంగా, పరంపరాగతంగా ప్రచారంలోఉన్న పురాణాలనుగురించి ఇంతవరకు తెలుసుకొన్నాం. ఇప్పుడు మతప్రమేయంలేని ఇతర లౌకికసాహిత్యపు తీరు తెన్నులు పరిశీలించుదాం. ఆనాటి రచయితలలో ఆత్మస్త్రైజం కలగడంచేత రచనాక్రమంలోనే చాలా మార్పులు వచ్చాయి. పాత కొత్తల సంధికి సంబంధించిన రచనలు కూడా చాలా ఉన్నాయి. గిల్‌గమేష్ కథానాయకుడుగా ఒక కవి ఒక పెద్ద ఇతిహాసాన్ని రచించాడు. మట్టి పలకల మీద గంట్ల లిపిలో ఉన్న యీ కావ్యం తాలూకు పలకలు కొన్ని అసూర్ బనిపల్ భాండాగారంలో ఉండేవి. ఈ ఇతిహాసం అవతారికలో ఫలశ్రుతి ప్రశంస ఉంది. గిల్‌గమేష్‌వంటి మహావీరుని చరిత్ర తెలుసుకోవటంవల్ల, యీ గ్రంథం అంతటినీ ఆమూలాగ్రం పఠించడంవల్ల పాఠకులకు ఎలాంటి మేలు చేకూరుతుందో కవి చెవులూరేటట్టు వర్ణించాడు. పాఠకుల అభిరుచులను ముందుగానే ఆకట్టుకోడానికి

రచయితలు ఆనాటినుంచే ప్రయత్నంచేస్తూ ఉన్నారని చెప్ప డానికి ఇది నిదర్శనం.

గిల్‌గమేష్ చరితం కృత్యాదిని ఎరక్ ముట్టడిలో ఆఖరుఘట్టం వర్ణనతో కథ ప్రారంభమౌతుంది. శత్రుసేనల ముట్టడిలో ఉన్న పట్టణంలో అరాజకం పెరిగిపోయింది. విధ్వంసకాండ విపరీతంగా కొనసాగింది. గోవులు దూడలను కుమ్మివేసాయి. మానవులు పశువులవలె చెవులు చిల్లులు పడేటట్టు రకరకాలుగా అరవడం ప్రారంభించారు. కన్నె పడుచులు గువ్వలవలె దుఃఖంతో రవరవలాడిపోయారు. ఆపత్కాలంలో నగర రక్షాదక్షులైన దేవతలుసైతం ఏమీచేయలేని నిస్సహాయస్థితికి దిగజారిపోయారు. ఈగలు, దోమలుగా మారిపోయి వీధులలో రొదచేసుకుంటూ ఎగిరే వారు. కథ ఈ ఘట్టానికి వచ్చేసరికి కొన్ని పలకలు శిథిలమై పోయాయి. పోయినవి పోగా మిగిలినగ్రంథాన్ని తిరిగి చదవడం ప్రారంభిస్తే కథ కొత్తఘట్టంలో పడ్డట్టు తెలుస్తుంది. ఈదశలో నగరం శత్రువుల ముట్టడినుంచి విడిపించబడిందని, గిల్‌గమేష్ ఆ సమయంలో దానిని పరిపాలిస్తున్నాడని పాఠకులు తెలుకోగలుగుతారు. బహుశా నగరాన్ని ముట్టడించిన శత్రుసేనలకు గిల్‌గమేష్ నాయకుడని, ఆయన దానిని జయించి తన పరిపాలనలోకి తెచ్చుకొని అక్కడ సుస్థిర ప్రభుత్వాన్ని ఏర్పరిచాడని భావించవలసి ఉంటుంది. లేదా గిల్‌గమేష్ స్థానిక వీరుడని, ముట్టడి సమయంలో ముందుకు వచ్చి, తన పరాక్రమంచేత శత్రువులను ఓడించి, నగరాన్ని

కాపాడినందుకు కృతజ్ఞతతో అందరూకలసి ఆయనను నగర పాలకుడుగా ఎన్నుకొని ఉండవచ్చు.

ఒక మహాపురుషుణ్ణి కథానాయకుడుగా ఎన్నుకొని కావ్యాలు వ్రాయడం ప్రపంచంలో పెక్కు దేశాలలో పరంపరాగతంగా వస్తూన్న సంప్రదాయమే. అన్ని దేశాల లోను సంధిసమయంలో వెలువడిన సారస్వతంలో కథా నాయకులకు సర్వసామాన్యంగా ఉండే లక్షణాలన్నీ ఆ సమ యంలో వెలువడిన మెసొపొటేమియా కావ్యనాయకులకు పట్టాయి. అనగా యీ కథానాయకులందరూ జన్మచేత మానవమాత్రులే అయినప్పటికీ, దైవాంశసంభూతులుగా మహాశక్తిసంపన్నులుగా చిత్రితమవుతూ ఉండేవారు. గిల్ గమేష్ కూడా అంతే. పైగా అతిలోక శక్తిగల వీరందరికీ ఆదికాలపు దేవతలకుండే దుర్లక్షణాలుకూడ చాలా ఉండేవి. గిల్‌గమేష్ అందగాడు. ఆజానుబాహువు. అతిలోకశక్తి వంతుడు. ఏదో మహోత్సాహ పరిస్థితిలో ఒక బ్రహ్మాండ మైన కట్టడాల కార్యక్రమాన్ని ప్రారంభించారు. పగలూ, రాత్రి అనకుండా దేశంలో అందరి యువకులచేత రెక్కలు ముక్కలు అయ్యేటట్టు పనిచేయించాడు. నగరానికి చుట్టూ ప్రహరీ కట్టించే పనిలో తమ పిల్లల నందరినీ నలిపి చంపి వేశాడని తండ్రులు అందరూ గోలపెట్టారు. ఇంతకంటె ఘోరం అందగాడైన గిల్‌గమేష్ దేశంలో ఒక్కరికీ భార్యను దక్కనివ్వలేదు. ఏ తల్లికీ కన్నెకూతుళ్ళను మిగలనీయలేదు. ఈ పరిస్థితులలో నిస్సహాయులైన ప్రజలు గత్యంతరంలేక గిల్‌గమేష్ తల్లియైన ఆరూరు అనే దేవతకు మొరపెట్టు

కుంటారు. గిల్‌గమేష్‌కు సర్వవిధాలా సరిజోడీ అనదగిన మరొక కుమారుణ్ణి కనవలసిందని, సుందోపసుందుల వంటి యీ అన్నదమ్ములు ఇద్దరూ ఎల్లప్పుడూ పరస్పర యుద్ధంలో మునిగి తేలుతూ ఉంటే ప్రజలు కాస్త ప్రభుపీడ లేకుండా ప్రశాంతంగా బ్రతికే అవకాశాన్ని ప్రసాదించవలసిందనీ ప్రార్థించారు. అంతట ఆ దేవత అనుగ్రహించి ఎంగిడు అనే మహాశక్తిశాలి అయిన మానవుణ్ణి సృష్టిస్తుంది. ఈ మనిషి అడవిపంది అంత బలమైనవాడు. సింహానికున్న పరాక్రమం, పక్షికున్న వేగం కలవాడు. నిజంగా ప్రకృతిమాత పుత్రుడు. మానవునితో ఎలాంటి పరిస్థితులలో కూడా పొత్తుపెట్టుకోకుండా, అన్ని పరిస్థితులలోను అడవిజంతువులతోనే కలసి మెలసి తిరుగుతూ ఉండేవాడు. అడవిలో కందమూలాలు తిని కడుపునింపుకొనేవాడు. దాహంవేస్తే సెలయేటి తేట నీటిని తాగేవాడు. జలజంతువులతో అస్తమానం ఆటలు ఆడుకునేవాడు. ఇతనిని ప్రాణాలతో పట్టి తీసుకురమ్మని గిల్‌గమేష్ ఒక పెద్దపేరుమోసిన వేటగాణ్ణి వలయిచ్చి పంపించాడు. కాని ఎంతో తెలివైన ఎంగిడుముందు ఆ పప్పులు ఉడకలేదు. ఎంగిడు ఎల్లప్పుడూ తప్పించుకు పారిపోతూ ఉండేవాడు. అప్పుడు గిల్‌గమేష్ అమోఘమైన ఒక పాచిక వేశాడు. తాను స్వయంగా స్త్రీల అందచందాలకు దాసుడుకనుక హొయలు, వన్నెలు, చిన్నెలు, కులుకు, బెళుకు, తళుకు చూపించి ఎంగిడును ఎలాగైనా లొంగదీసుకు రావలసిందని చెప్పి సౌందర్యరాశియైన ఒక అప్సరసను పంపించాడు. ఆమె ఒక సెలయేటి ఒడ్డున పొంచిఉండి,

ఎంగిడును ఎలాగైతేనేం తనవలలోపడేసుకుంది. అసహాయ శూరునివలె అడవిఅంతా స్వైరవిహారం చేసే ఎంగిడు ఆఅందాల భరిణె మోహపంజరంలో చిక్కుకుని, ఆమె రమ్మన్న చోటికల్లా వెళ్ళాడు. చేయమన్నది అంతా చేశాడు. మచ్చిక అయిపోతాడని అనుకుంటున్న సమయంలో ఏడు రాత్రులు గడచేటప్పటికి మొహం మొత్తి తన పాత మిత్రులైన జంతువుల దగ్గరకు పోవాలని గోలచేయడం ప్రారంభించాడు. కాని అతనిని ఎలాగైనా తీసుకువెళ్ళాలని ఆ సుందరాంగి పట్టుపట్టి అనేకవిధాల ప్రోత్సహించింది. ఈ యోధులు ఇద్దరిమధ్య కలహం అనివార్యం కావడం తల్లికి నచ్చలేదు. ఆ రాత్రి ఇద్దరికీకూడ చిత్రంగా ఒకే రకమైన కలవచ్చింది. యుద్ధమే జరిగేటట్లు అయితే విజయం ఎవరికీ కలగక పోవచ్చునన్నది ఆకల సారాంశం. ఆ సమయంలో చుక్కలు తనమీద రాలినట్లు గిల్‌గమేష్‌కు కలవచ్చింది. ఈ సంగతి తల్లికి చెప్పాడు. అందువల్ల ఏలాగైనా ఎంగిడుతో స్నేహం చేసుకోవలసిందని ఆమె సలహా ఇచ్చింది.

అప్పుడు ఇద్దరూ పగను మరచిపోయి, ప్రాణమిత్రులు అయిపోయారు. తరువాయి కథ అసంపూర్తిగానిలిచిపోయింది. కాని అందులో ఈ ఉభయులు కలిసి ఎరెక్ రాజ్యాన్ని ముట్టడించ దలచిన ఎలెమ్ రాజుపై దండయాత్ర జరిపారు. ఫలితం వీరికే అనుకూలం. వీరుభయులు విజేతలై శత్రు రాజ్యాన్ని పూర్తిగా కొల్లగొట్టి అపారసంపదలతో స్వరాష్ట్రానికి తిరిగివచ్చారు. అనంతరం గిల్‌గమేష్ సైనికవేషాన్ని త్యజించి, ధవళ వస్త్రాలను ధరించి, ఛత్ర చామర

కిరీటాది రాజలాంఛనాలతో వైభవోపేతంగా రాజ్య పాలన చేస్తూవున్నాడు. మహా వీరోచితగౌరవాలతో మరలివచ్చిన గిల్‌గమేష్‌ను చూసి ఇష్టారు ఆయనను ప్రేమిస్తుంది. ఎంతలో ఎంత మార్పు! ప్రియుని మృతికై కన్నీరు మున్నీరుగా విలపించు ప్రేయసిగా మనకు మొదట పరిచితమైన ఇష్టారు, యిప్పుడు అతని తీరని విరహజ్వరంతో వెచ్చనూర్చే కాముకిఅయిన దేవతగా ప్రత్యక్షమవుతుంది. గిల్‌గమేష్‌ను సమీపించి, స్త్రీ సహజభూషణములైన వ్రీడా వినయములను విడనాడి, తన అభీష్టాన్ని గుట్టు బెట్టు లేకుండా బాహాటంగా విన్నవిస్తుంది. "రమ్మో, రమ్మో నాథ! నా మనో నాథ! కాముకిని నేను, కాంతుడవు నీవు. ప్రణయ భిక్ష నిడి, పాలింప రావో ప్రాణనాథ" అని అర్థిస్తుంది. "నీవు నా భర్తవు, నేను నీ భార్యను. రత్నాలు, వజ్రాలు పొదిగిన బంగారు చక్రాలున్న రంగురంగుల రథంలో కూర్చుండబెట్టి సింహాలచేత లాగిస్తూ ఊరేగించుకుంటాను. దివ్య పరిమళ భరితములైన కర్పూరనీరాజనాల మధ్య నిన్ను గృహ ప్రవేశం చేయిస్తాను. సముద్రమేఖల అయిన సర్వ వసుంధర నీకు పాదాక్రాంత మవుతుంది. దేశదేశాల రాజులు నీముందు మోకరిల్లి నమోవాకాలు పలుకుతారు. గిరులపై, తరులపై, వనిలో, గనిలో లభించే అపారసంపదలను నీకు ఉపాయ నాలుగా సమర్పిస్తారు." మనసులు కరగించే యీ మసులకు గిల్‌గమేష్ లొంగలేదు. పైగా ప్రతివారినీ యిలాగే మురిపించి, మరపించి, చివరకు అందరకూ ద్రోహం చేసిన ఈమె గతచరిత్ర అంతనూ తవ్వి, ఆమె ప్రేమను

తిరస్కరిస్తారు. ఈ సందర్భంలో బాధను కలిగించే గాధలను జ్ఞప్తికి తెస్తాడు. "పాపం ఆ తోటమాలిచేసిన తప్పు ఏమిటి? నిన్ను గాఢంగా ప్రేమించడమేనా? మీ తండ్రి అతని కొలువులో వుండేవాడు. ఆ నిర్భాగ్యుడు తన బ్రతుకేదో తాను బ్రతకకుండా, నువ్వు అతనిని మోహించి, పెడదారులకు ఈడిచావు. నీ ప్రేమ నిజం అనుకొని నిన్ను సంతోష పెట్టడంకోసం రోజు రోజుకు తాహతుకుమించిన కానుకలు కొని తెచ్చేవాడు. నువ్వు తిన్న కంచాలనుసైతం కడిగి శుభ్రంచేస్తూ నీ సొంత నౌకరుకంటే నికృష్టంగా ఉచ్ఛనీచాలను పాటించకుండా ఊడిగం చేశాడు. నీ ముద్దూ, మురిపెం తీరి నీ మనసు మరొకరివైపు మరలినప్పుడు నీవు ఏమి చేశావు? ఛీ! పాపీ!! పక్షపాతంతో పడిపోయేటట్టు మంత్రం పెట్టి పోయావు. అంతటితో ఆగాయా నీ ఆగడాలు? ఓసారి తెనెపూసిన కత్తులవంటి నీ ప్రణయార్ద్రవీక్షణాలు పాపం ఒక వెర్రిగొల్లపై ప్రసరించాయి. కొంతకాలంపాటు అతనితో కులికావు. ఇష్టమున్నప్పుడు ఏమిచేసినా, చివరకు ఏమి జరిగింది? అతనంటే మొహం మొత్తింది. చివరికి అతనికి స్వస్తి చెప్పి, మరొకణ్ణి చేబట్టావు. పోతూ పోతూ నిన్నన్ని విధాల ఆనందపరచిన వెర్రిగొల్లకి నీవు చేసిన ఉపకారం ఏమిటి? చిరుతపులిగా అతన్ని మార్చి పారవేశావు. పాపం అతని నౌఖరే అతనిని తరిమివేశాడు. అతను పెంచిన జాగిలాలే అతనిని ముక్కలు ముక్కలుగా చీల్చి చెండాడి వేశాయి. నిన్ను నీ ప్రేమను నమ్మింది ఎవరు? వెళ్లు. వెళ్లు. నీకు మొగుడుగా ఉండడంతప్ప నాకు వేరే పనేమీ లేదు

ఇష్టారుపీడ యీ విధంగా వదలిపోవడంతో ఇదంతా తన ప్రతిభేనని గిల్‌గమేష్ మురిసిపోతాడు. లేనిపోని గొప్పలు చెప్పుకుంటూ, ప్రపంచంలో తనకంటె గొప్పవాడు లేనట్లు కూనరాగాలు తీస్తాడు. ఆత్మస్తుతి ఆకాశాన్ని అంటింది:

వీరులందున వీరు డెవ్వడు ?
మనుజులందున మాన్యు డెవ్వడు ?
కీర్తి కాంతా జీవితేశుడు
గిల్గమేశుడు ! గిల్గమేశుడు !

కాని జీవితచక్రం తిరుగుతూనే ఉంటుంది. బండ్లు ఓడలవుతూ వుంటాయి. ఓడలు బండ్లు అవుతూ వుంటాయి. ఇష్టారు ఎంగిడుపై తన కసితీర్చుకోవడంకోసం శాపమిచ్చి వ్యాధిగ్రస్తుణ్ణి చేసివేస్తుంది. ఆజబ్బుతో అతడు తీసుకుతీసుకొని చచ్చిపోతాడు. తన్నెంతో ప్రేమించి తనకు అన్నివిధాల చేదోడు వాదోడుగా వున్న అనుంగు సోదరుడు యీ విధంగా అకాలమృత్యువు వాతపడి దుర్మరణం చెందడంతో గిల్‌గమేష్ ఆ దెబ్బకు తట్టుకోలేకపోతాడు. తానంతవరకు గడుపుతున్న విలాస జీవితాన్ని ఒక్కుమ్మడిగా వదిలిపెట్టి, జీవిత పరమార్థాన్ని తరచి తెలిపే తత్వ జిజ్ఞాసలో మునిగిపోతాడు:

మట్టిగలసిన ప్రాణమిత్రుడు
మట్టిలో నిదురించునప్పుడు,
తరుణ పత్రమువోలె నా మది
మరణమన వడకున్.
పుడమిశయ్యగ పవ్వళించితి
పుడమిలో నిదురింతునా ?

మృత్యురహస్యాన్ని గురించి, మృత్యుంజయమైన మార్గాలను గురించి తీవ్రమైన ఆవేదనతో అన్వేషణ ప్రారంభిస్తాడు. ఈ తర్జన భర్జన సందర్భంలో తాను మహా జల ప్రళయంలో దేవతలచేత జరామరణరహితుడుగా అనుగ్రహించబడిన ఏకైకమానవుడైన ఉట్నాపిష్టింసంతతి వాడనని తెలుసుకుంటాడు. అందుచేత ఆ మృత్యుంజయుడైన మొదటి మానవుణ్ణి వెదకి పట్టుకొని ఆయన దగ్గరనుంచి అమరత్వ సాధన రహస్యాన్ని నేర్చుకోవాలనే కుతూహలంతో బయలుదేరాడు.

ఈ ప్రయాణం సామాన్యమైనది కాదు. సాహసోపేతమైనది. అడుగడుగునా ముందేమి రానున్నదో అను ఉత్కంఠను కలిగిస్తూ ఉంటుంది. ఈ సందర్భంలో గిల్‌గమేష్ దుర్గమమైన మార్గంలో ప్రవేశించి ముందుకు వెళుతూ ఉంటాడు. ఈ దుర్గమ మార్గాన్ని ఇద్దరు రాక్షసులు కాపలా కాస్తూ ఉంటారు. ఈ రాక్షసులు సామాన్యులు కారు. వీళ్ళ తల ఆకాశంఅంత ఎత్తు. వీరి ఉరము వెడల్పు ఉర్వీఅంత. ఈ ప్రయాణంలో గిల్‌గమేష్ కన్ను పొడుచుకున్నా కానరాని పన్నెండుమైళ్ళ చీకటి సొరంగంలో ప్రవేశించి చివరకు ఒక సముద్రం ఒడ్డుకు చేరుకుంటాడు. సముద్రాధిదేవతయైన సవితు అనే కన్నె దేవత సింహాసనాన్ని చూస్తాడు. అంతట సముద్రాన్ని దాటడంలో తనకు తోడ్పడవలసిందని ఆమెను ఎలుగెత్తి ప్రార్థిస్తాడు. లేకపోతే అక్కడే ఆగట్టునే ప్రాయోపవేశంచేసి ప్రాణత్యాగం చేసుకుంటానని ప్రతిజ్ఞపట్టి ప్రార్థిస్తాడు. ఇతనిని చూసి ఆమె చాలా జాలిపడుతుంది. కాని, ఇలాంటి

వ్యర్థమయిన అన్వేషణలో జీవితాన్ని నాశనం చేసుకోవలదని అనేకవిధాల నిరుత్సాహపరుస్తుంది.

నల్గడల పరువెత్తినావే
దిల్గమేశా దేనికోసము ?
దొరుకరానిది నీవు వెదకిన
దివ్య జీవనము.

మానవుల సృజియించి దివ్యులు
మరణ మొకటే వరము నిచ్చిరి.
తమకు మాత్రమే దాచుకొన్నా
రమర జీవనము.

తినుము, త్రాగుము గిల్గమేశా
అనుదిన మ్మానందడోలల
తూగి, నృత్యములాడి, నిత్యము
భోగివై మనుము.

శుచిగ స్నానము నాచరింపుము,
శుభవస్త్రములన్ ధరింపుము.
సతిని కౌగిలి నాదరింపుము,
సుతుని కొక ముద్దిమ్ము.
నరుని జీవితయాత్ర కిదియే
ధ్యేయమూ గాదా ?

ఎంతచెప్పినా వినకుండా తా నన్వేషణను సాగించి తీరవలసిందేనని గిల్గమేష్ పట్టుపట్టాడు. సవితు ప్రళయ సన్నిభమైన పెనుతుపాను మధ్య అల్లకల్లోలంగాఘూర్ణిల్లుతున్న

ఆ సముద్రాన్ని దాటడానికి గిల్‌గమేష్‌కు నలభైరోజులు పడు తుంది. చివరకు అతని కష్టం ఫలించింది. ఎలాగైతేనేం సవితు దేవి అనుగ్రహంవల్ల నలభై రోజులలో సముద్రాన్ని దాటి గండాలన్నీ గడచి ఉట్నాపిష్టమ్ నివసిస్తున్న సౌఖ్యపుదీవికి చేరు కుంటాడు. ఈ ఘట్టంలో జలప్రళయపు గాధఅంతా ఉపాఖ్యాన రూపంలో గిల్‌గమేష్ కథలో చేర్చబడింది. ఈ సందర్భం లోనే ఆ మహాప్రళయంనుంచి మిగతా సృష్టి అంతా సర్వ నాశనమైపోతూ ఉన్న సమయంలో తను ఎలా బ్రతికి బయట పడిందీ, కళ్ళకు కట్టినట్లు వర్ణించి చెబుతాడు. ఆ తరువాత ఒక చిన్న మొక్కను గిల్‌గమేష్‌కు బహుమానంగా ఇస్తాడు. దీనిపండు తిన్నవారికి తిరిగి యవ్వనం లభిస్తుందని కూడ చెబుతాడు. అంతట ఆ మొక్కను తీసుకొని గిల్‌గమేష్ ఇంటికి తిరుగుముఖం పడతాడు. త్రోవలో స్నానం చేద్దా మనే ఆశతో నీటిలో దిగేసరికి యీ మొక్కనుకాస్తా ఒక పెద్ద పామువచ్చి దొంగిలించుకు పోతుంది. స్నానం చేసి ఒడ్డుకువచ్చి మొక్కకాస్తా పోయిందని తెలుసుకొని నిరాశతో ఇంటికి తిరిగివస్తాడు. ఆ తరువాత ఎంగిడుకు ప్రాణదానంచేసి తనతో ఒక్క నిముషం మాట్లాడనివ్వ వలసిందని దేవతలను తీవ్రంగా ప్రార్థిస్తాడు. అంతట ఎంగిడు ఆత్మ అతనికి లీలగా ప్రత్యక్షమై ఏం కావాలని అడుగు తుంది. అప్పుడు మరణానంతరం జీవుల స్థితిగతులను గురించి ప్రశ్నిస్తాడు. ప్రేతలోకపు పరిస్థితి మహా ఘోరంగా, దారు ణంగా, భయంకరంగా ఉంటుందని, అక్కడి పరిస్థితిని వింటే ఎంతటి ధైర్యశాలికైనా గుండెలు అవిసిపోతాయని, కనుక

ఆ సంగతి మరి తలపెట్టవద్దని ఎంగిడు ఎంతో ప్రతిమాలు తాడు. ఏమైనాసరే చెప్పితీరవలసిందని గిల్‌గమేష్ పట్టు పడతాడు. అప్పుడు విధిలేక ఎంగిడు ప్రేత లోకవాసుల పరిస్థితినంతా భయంతో వళ్ళు జలదరించిపోయేటట్లు వర్ణించి చెప్పాడు. ఈ స్థితిలో మనకు దొరికిన అసంపూర్తి ఇతిహాసం ముగుస్తుంది.

ఇది క్రీస్తు పూర్వం మూడు వేల అయిదు వందల (3500) సంవత్సరములనాటి ఐతిహాసిక కావ్యం. దీనిలో ఇతిహాస కావ్యాల లక్షణాలన్నీ పూర్తిగా ఉన్నాయి. పైగా గ్రీకు కావ్యమైన యులీసిస్ సాహస కృత్యాల రచనకు ఇది నాందీప్రాయమైనది. ఇందులో యుద్ధం, ముట్టడి, వ్యక్తిగత మైన కలహాలు, కాట్లాటలు, ప్రణయం, ప్రళయం అన్నీ ఉన్నాయి. విజయోల్లాసం, దుఃఖోద్వేగం, వీర కరుణ శోకచ్ఛాయలు యథోచితంగా పాఠకులపై తమ ప్రభావాన్ని చూపిస్తూనే ఉంటాయి.

ఈకావ్యంద్వారా మనకుకథానాయకుడైన గిల్‌గమేష్ దైవాంశ సంభూతుడుగా, మానవాతీతుడుగా పరిచయ మౌతాడు. రెండువంతులు దేవుడుగాను, ఒకవంతు మానవుడుగాను మన కట్టెదుట గోచరిస్తాడు. నిజం చెప్పా లంటే గిల్‌గమేష్ గుణవర్ణనలో అడుగడుగునా అతి శయోక్తులే అద్భుతగులుతూ ఉంటాయి. కవి తన కథా నాయకుణ్ణి మెరమెచ్చులకోసమో, ఇచ్ఛకాలకో ఆకాశానికి ఎత్తేస్తూ ఎంతగా పొగిడినప్పటికీ మన అందరిలాంటి సామాన్య మానవుడే. మనకున్న ఆశలు, అనుభవాలు అతనికీ

ఉన్నాయి. మానవుడు చేసే పొరపాటులన్నీ అతడూ చేస్తాడు. విజయ అధికారాన్ని దుర్వినియోగం చేసిన సందర్భాలు అనేకం. ముఖ్యంగా తన విషయవాంఛల సంతృప్తి పరచుకోవడం కోసం చేయరాని, చేయని పనంటూ లేదు. అయినప్పటికీ ప్రతి మానవునిలోను ఉన్నట్లుగానే అతనిలోను దైవాంశ అంటూ లేకపోలేదు. స్నేహితులంటే ప్రాణం ఇవ్వగలిగినవాడు, ఇచ్చేవాడు కూడ. ఒకసారి ఏదైనా ఆపద కలిగినప్పుడు అతనిలో తత్వజిజ్ఞాస ప్రబలమయ్యేది. అలాంటి సందర్భాలలో మామూలుగా బ్రతకడంతో సంతృప్తి పడక ఎంతటికష్టానికైనా వెనుదీయకుండా, జీవితపు లోతులకు సంబంధించిన సందేహాలకు సరియైన సమాధానాలు సంపాదించేవరకు ఊరుకునేవాడు కాదు. ఇలాంటి తర్జన భర్జనల జోలికిపోకుండా తత్వజిజ్ఞాసలో మునిగిపోకుండా విలాసమయ సుఖజీవితాన్ని తిరిగి అనుభవించ వలసిందని సవితు ఎంతగా ప్రోత్సహించి నప్పటికీ లెక్కచేయనేలేదు. తన తత్వజిజ్ఞాస ఫలితంగా తగు సమాధానం లభించనప్పటికీ ఆయన జీవితం మాత్రం మానవుని అనంతజిజ్ఞాసకు నిదర్శనంగా చరిత్రలో చిరస్థాయి అయిపోయింది. కనుకనే గిల్‌గమేష్ గుణగణాలను గానంచేస్తూ కవి ప్రకటించిన ప్రశంసా భావాలతో మనం కూడ పూర్తిగా అప్రయత్నంగానే ఏకీభవిస్తాం.

దిగంతాలదాకా ప్రయాణించి చూచెన్
జగద్గర్భ నిక్షిప్తరాహస్య మెల్లన్
నిరంత ప్రయాసా సహిష్ణుత్వశక్తిన్
మహాజ్ఞాన సంపన్నుడై దీప్తి నొందెన్

అసత్యావకుంఠావృతంబైన సత్యా
ననంబున్ కనుంగొన్న ధీరుం డతండే.

ప్రాచీన సారస్వతంలో లౌకిక వాఙ్మయ రచనకు గిల్‌గమేష్‌గాథ సొందివంటిది. కట్టుకథలకు ప్రణయకవిత్వానికి కూడ మెసొపొటేమియా రచయితలే పునాదులు వేశారు. ఈ కట్టుకథలలో దేవుని ప్రస్తావన చాలా ఉన్నప్పటికీ సృష్టి, ప్రళయం వీటన్నింటితో కూడిన పురాణ వాఙ్మయానికి యీ మాదిరి లౌకిక వాఙ్మయానికి వస్తుతః ఉన్న తేడా మనకు స్పష్టంగా కనబడుతూనే ఉంటుంది. ఇందులో మత ప్రసక్తి చాలావరకు వుండదు. చాలావరకేమిటి అసలు ఉండనే ఉండదు. ఎరిష్కిగాల్ కథ ఇందుకు మంచి నిదర్శనం. ఈ ఎరిష్కిగాల్ రాక్షసదేవత. ఈవిడపేరు చెప్పితేనే అందరూ హడలిపోతూ ఉండేవారు. వట్టి గయ్యాళి. ఈమెను భర్త పట్టుదలతో మచ్చికచేసి మంచి మనిషిగా మార్చివేస్తాడు. ఒకప్పుడు దేవతలందరూ పెద్ద విందుచేసుకుంటారు. దానికి ఎరిష్కిగాల్‌నుకూడ ఆహ్వానించారు. అయితే ఆమె తన రాజ్యాన్ని వీడి బయటకు రాలేదు. కనుక తనవంతు భోజనాన్ని తెచ్చి పెట్టడానికి ఒక పనిమనిషిని పంపవలసిందని కోరతారు. ఆమె సరేనని ఒక దూతను పంపుతుంది. ఈ దేవతలలో ఒక్కడు మినహా మిగతా అందరూ యీ దూతను చూడగానే లేచి నిలబడి ప్రత్యుత్థానం చేసి ఆహ్వానిస్తారు. ఈ దూత తిరిగి వెళ్ళి యీ సంగతిని తన యజమానురాలికి తెలియ పరుస్తాడు. ఇది వినేసరికి ఆమె ఆగ్రహావిష్ట అవుతుంది. తనను యీ విధంగా అవమానపరచిన దోషిని

తక్షణమే తనకు అప్పగించమని,తప్పుకు తగిన శిక్షగా అతనిని చంపివేయదలచానని స్వర్గానికి కబురు పంపిస్తుంది. దేవత లందరూ కలసి దోషి ఎవరో తెలుసుకోడానికి ప్రయత్ని స్తారు. వీరందరూ ఒకచోట చేరినప్పుడు ఒకడుమాత్రం వెన కాల పడ్డాడు. అతడే దోషి అని దూతగుర్తించి తనవెంట నర కానికి తీసుకుపోయాడు. ఈ దేవుని పేరు నెరిగాల్. ఈ నెరిగాల్ దూతవెంటకిక్కురుమనకుండా నరకం దాకా వెళ్ళి, అక్కడ తిరుగబడ్డాడు. ఇతనిని చంపుతాను నరుకుతాను అని ఎరిష్కిగాల్ బెదరించేలోపుగానే నెరిగాల్ ఆమెను కొప్పు పట్టి సింహాసనంమీద నుంచి ఈడ్చి పారవేశాడు. ఆ కోపంలో ఆమెను చంపివేయబోతూ ఉండగా పరిస్థితి తప్పి వచ్చిందని గ్రహించి ప్రాణభిక్ష పెట్టవలసిందని ప్రార్థిస్తుంది.

నెరిగాల్ ఆమె కొప్పు పట్టు కాస్త విదిలించేసరికి ఆమె తన్ను భార్యగా స్వీకరించి ధన్యను చేయవలసిందని, భూలోకానికి అంతకీ అతనిని రాజుగా చేస్తానని, వివేకపు గుళిక అతని చేతిలో పెట్టి రాజూ రాణీగా లోకాన్నంతా ఏలుదామని ప్రార్థిస్తుంది. అంతట నెరిగాల్ ఆమెను చేరతీసి కన్నీరు తుడిచి ముద్దిడి ఇన్ని నెలలనుంచి ఇంతగా ప్రాధేయ పడుతున్నావు కనుక ఒప్పుకుంటున్నానని చెప్పుతాడు. ఇతడు చెప్పినదానిని బట్టి ఆమె చాలా కాలంగా ఇతనిని ప్రార్థిస్తూ ఉందనీ, అయితే తన తత్వం ఆమెకు బాగా అర్థం అయ్యేవరకు ఊరుకొని అప్పుడు అంగీకరించాడని తెలుస్తుంది.

పక్షుల స్వేచ్ఛను చూసి మానవుడు ఎల్లప్పుడూ అసూయపడుతూనే ఉండేవాడు. అందుచేత మామూలుగా

ఎగర లేకపోయినా ఊహలతోనయినా ఆకాశం ఎత్తు ఎగిరి వెళ్లేవాడు. ఇలాంటి కల్పనా కథలలో ఒక దాని నాయకుడు ఎటానా. రాబందు యితనికి మిత్రం. ఒకానొక సందర్భంలో తన మిత్రుడు అయిన ఎటానాను స్వర్గం వరకు తీసుకువెళ్ల డానికి వాగ్దానం చేస్తాడు. ఆ ప్రకారం ఎటానా యీ రాబందు రెక్కలను గట్టిగా పట్టుకొని భూమి నుంచి పైకి ఎగిరి వెళతాడు. పైకి ఎగిరివెళ్లుతున్న కొలదీ అంతకంతకు చిన్నదై పోతున్న భూమి కేసి చూడవలసిందని యీ రాబందు తన మిత్రుని హెచ్చరిస్తుంది. ఈ విధంగా దోవపొడుక్కీ మూడుసార్లు హెచ్చరిస్తుంది. ప్రతిసారి ఇతడు భూమిని కొత్తకొత్త ఉపమానాలతో పోలుస్తాడు. ఏకటాకీని ఎంతో ఎత్తుకు రెండుగంటలసేపుఆకాశంలో పై పైకిఎగిరిరాబందు ఇలా అటుంది: "చూడు మిత్రమా చూడు. భూమి కేసిచూడు. భూమిఅంతా పెద్ద పర్వతంలాగా, సముద్రం సరస్సులాగా మారిపోయాయి కదూ?" అని మరో రెండుగంటలసేపు ఇంకా ఎత్తుకు తీసుకువెళ్లి "ఇప్పుడు చూడు. సర్వవసుంధర సముద్ర మేఖల అయిందికదూ?" అంటుంది. మళ్లీ మరొక రెండు గంటలసేపు ఇంకా ఎత్తుకు ఎగిరి "యీసారి సముద్రం చిన్న పిల్ల కాలువలా మారిపోయిందికదూ?" అంటుంది. మరికొంత ఎత్తుకువెళ్లి "యీసారి ధరణిఅంతా చిన్న పూబంతిగా మారి పోయిం"దని చెపుతుంది. ఇది నిజంగా మనోహరమైన కల్పనా కథ.

జంతువులు మాట్లాడుకుంటూ ఉండే నీతికథలు మెసొపొటేమియాలో బహుళ ప్రజాదరణకుపాత్రమయ్యాయి

దులైన అస్సీరియా రాజులకు యుద్ధాన్ని గురించి కలలువస్తే శాంతి ప్రియులైన మరి కొందరు రాజులను ప్రజాహితం కోసం నిర్మాణాత్మక కార్యక్రమాన్ని చేపట్టవలసిందని ప్రబోధించే కలలు వచ్చాయి. లెగాష్‌ను పరిపాలించిన గూడియా స్వభావతః శాంతిప్రియుడు. ఒక సందర్భంలో ఆయనకు క్రిందివిధంగా కలవచ్చినట్టు ఒకచోట వ్రాసుకున్నాడు: "నాకు ఒక రోజున ఒక కల వచ్చింది. అందులో సూర్యునివలె వెలిగిపోతూ, భూమివలె సంతోషంతో గిరున తిరుగుతూ వుండేమానవుడు ఒకడు నాకు ఆ కలలో కనిపించాడు. ఆయన తలకు ధరించిన కిరీటాన్ని బట్టి సాక్షాత్తు దేవుడే అని తెలుసుకున్నాను. ఆయన సరసను నల్లని తుపాను పక్షి కనిపించింది. ఆయన ముందు, వెనుక తుపానులే కనిపించాయి. ఆయన కిరు పార్శ్వాల సింహాలు నిలచివున్నాయి. ఆ దేవుడు తనకొక ఆలయాన్ని కట్టించి పెట్టవలసిందని ఆదేశించాడు. ఆ ప్రకారమే గూడియా దేవాలయ నిర్మాణాన్ని ప్రారంభించి, తనకు నచ్చినవిధంగా పూర్తిచేశాడు. 'ఈపవిత్ర దేవాలయం సూర్య కాంతిలో మిలమిలా మెరసిపోతున్నది. దాని కాంతితో దేశమంతా వెలిగిపోతున్నది' అని ఆయన వ్రాసుకున్నాడు. దేవాలయాల పరిసరాలలో తమ ప్రాసాదాలను నిర్మించదలచుకున్న రాజులు, చక్రవర్తులు ఎత్తులో తమ భవనాలు దానికంటె ఎన్నో రెట్లు చిన్నవిగా వుండేటట్టే జాగ్రత్తపడేవారు. తన ప్రాసాదాన్ని వర్ణిస్తూ అషూర్ బనిపాల్ ఒకచోట ఇలా వ్రాశాడు: "నేనుంటున్న రాజ ప్రాసాదం మీద మరికొన్ని అంతస్తులు వేశాను. కాని మా

కులదేవతల ఆలయాలకంటె ఎక్కువ ఎత్తుగా వుండేటట్టు కడితే ఏమి కీడు కలుగుతుందోనని భయపడి పెద్ద ఎత్తులకు పోవడం మానివేశాను."

అషూర్ బనిపాల్ మహారాజును బహుక్రూరుడైన సేనానిగా భావించడం చాలా పొరపాటు. ఆయన అభిరుచులు బహుళములు. ఆయన రణరంగధీరుడేగాక, ధీశాలుడైన కళాపోషకుడు కూడ. "నా దినచర్య ఇది – నేను గుఱ్ఱాలను సవారీ చేయడంలో ప్రత్యేక ప్రావీణ్యం సంపాదించాను. రౌతుకొద్దీ గుఱ్ఱం అన్నట్లు, నే నెక్కిన గుఱ్ఱం హానం చేయకుండా, మొరాయించకుండా చాలా జాగ్రత్తగా నడిపే వాడిని. విల్లంబులు వుపయోగించడం తెలుసు. రివ్వు రివ్వున యీటెలు విసరగలను. నా రథానికి నేనే సారథిని. యోధుల కవసరమైన కవచాలను, డాలును తయారు చేయించగలను. అంతేకాదు. రాజ మర్యాదలు, రాజోచిత విధానాలు నాకు బాగా తెలుసు." రష్యాను పరిపాలించిన పీటరు మహాచక్రవర్తివలె యీాయనకూడ, రాజోద్యోగుల విధులు అన్నింటినీ స్వయంగా నిర్వహించగలగటం వల్ల క్రిందివారందరికీ యీాయన పేరు సింహస్వప్నంగా వుండేది. ఎవరుఎంతెంత పని ఏ విధంగా చేయగలరో తనకు పూర్తిగా తెలుసు కనుక ఏదో వంకపెట్టి పని ఎగగొట్టడానికి ఎవరికీ అవకాశం వుండేదికాదు. అందుకోసమే, ఆయన యోధునికి అవసరమైన ఆయుధాలను పట్టడం నేర్పడమే కాకుండా, వాటిని తయారు చేయడం ఎలాగోకూడ నేర్పుతున్నాడు. పైగా ఎంతో కష్టపడి లిపిని అభ్యసించాడు. ఈ యుద్ధ

ప్రాచీనచరిత్ర అధ్యయనమన్న ఆసక్తి హెచ్చు. తన సమకాలీనులైన చారిత్రకులందరికన్నా ఈయన హెచ్చు పండితుడుఅన్న సంగతి నిర్వివాదం. ఈయన ఆ రోజులలోనే మహనీయమైన ఒకగ్రంథాలయంకూడ సమకూర్చుకున్నాడు. ఇటీవల కొంతమంది పురాతత్వవేత్తలు దానిని కనుగొని వెలికితీయ కలగడంవల్ల మెసొపొటేమియా చరిత్రను గురించి, నాగరకతను గురించి తెలుసుకోవడానికి మన కిప్పుడు అవకాశం కలిగింది. సమకాలీన చరిత్రనేకాక, ప్రాచీన చరిత్ర రచనకు కావలసిన ఆధారాల నన్నింటినీ సేకరించడానికి తాను తలపెట్టిన చర్యలు అన్నింటినీ ఈయన గ్రంథస్థం చేసి పెట్టాడు. ఇందుకు సంబంధించిన పలకల రూపంలోవుండే పత్రాలు అన్నింటినీ దేశమంతటా కలయతిరిగి గాలించి సేకరించి ఒకచోట చేర్చవలసిందిగా ప్రభుత్వోద్యోగులందరినీ ఆయన ఆదేశించాడు. మెసొపొటేమియా నాగరకత మనకు అతిప్రాచీనమైనది కావడంచేత ఆనాటివాడైన అషూర్ బనిపాల్‌కే సుమేరియా అకాద్ రాజ్యాల ప్రారంభం అత్యంత ప్రాచీనమైనది అనే సంగతి మనం మరచిపోవడం సహజం. పరిశోధనకు సౌకర్యాలు అంతగాలేని ఆ రోజులలో ఆయన ఎంతో దీక్షతో, ఓపికతో చరిత్ర పరిశోధనకు పూనుకున్నాడంటే కేవలం విద్యపట్లఆకర్షణ, పరిశోధనపట్లఆయనకు గల ప్రబలమైన ఆసక్తిమాత్రమే కారణమని చెప్పాలి. ఆయన తన కర్తవ్యాన్ని గురించి ఒకచోట ఇలా వ్రాసుకున్నాడు: "అత్యుత్తమము అయిన సుమేరియా సాహిత్యం అందచందాలను అందరికీ అందజేయడమే నా విధి. అలాగే

బహుకష్టసాధ్యమైన అక్కాడియన్ సాహిత్య విశేషాలను కూడా నలుగురికీ తెలియ చెప్పవలసి వుంది.''

ఈయన అవసాన సమయంలో ప్రజలలో చెలరేగిన అశాంతినిబట్టి మెసొపొటేమియాజాతిలో చరిత్రలో ప్రాధాన్యం వహించిన నైతిక సమస్యల స్వరూప స్వభావాలను అవగాహన చేసుకోవడానికి వీలు కలిగింది. తన ఆఖరు పలకమీద ఆయన యిలా వ్రాశాడు: ''దేవతలను, మానవులను, మృత్యువును, పరలోక వాసులను అందరినీ ఎల్లప్పుడూ సంతోషపెడుతూనే వుండేవాణ్ణి. ఎవరిక ఎన్నడూ ఎట్టి అపకారం చేయలేదు. అలాంటిది యీ ఆధివ్యాధులు నాకెందుకు రావాలి ? దేశంలోసంఘర్షణలను, కుటుంబంలో కలహాలను లేకుండా, రాకుండా చేయలేకపోయాను. రకరకాల వదంతులు, నిందాపూర్వకమైన కింవదంతులు నన్ను ఎంతో క్రుంగదీస్తున్నాయి. తను వ్యాధి, మనోవ్యాధి నన్ను అణచి వేస్తున్నాయి. బాధతో, మూలుగుతో అంతిమ ఘడియలకోసం ఎదురు చూస్తున్నాను. ఊరు అందరు నగరదేవత సంబరం చేస్తూవుంటే నేను దిక్కుమాలిన దౌర్భాగ్యునిగా మూలపడ్డాను. మెల్లిమెల్లిగా మృత్యువుకోరలకు ఎరఅయిపోతున్నాను. రాత్రి, పగలు "అలో"అని ఏడుస్తున్నాను. ఓయి భగవంతుడా! నేనెంతపాపినైనప్పటికీనీకరుణాకటాక్షవీక్షణాన్ని నాపై ప్రసరింపచేయి, మహానుభావా!"చేసు కున్న వారికిచేసు కున్నంత అన్నట్టు హత్యలు, దండయాత్రలు, గృహదహనాలు సాగించిన ఈ పాపానికి ఫలితంగానే చివరకు యీ మహారాజు యిన్నికష్టాలను అనుభవించాడని సరిపెట్టుకోచూడడం కేవలం

అవివేకం. ఏమైనా ఒకసంగతిమాత్రం నిజం. ఆయన పూజించి ఆరాధించిన దేవుడు అనాగరికజాతులవాడు. ఇతర దేవుళ్ళ పొడకిట్టనివాడు. ఇతర దేవుళ్ళను ఆరాధించేవా రందరి తలలు నరికి తెచ్చి తనకు నైవేద్యం చేయమని కోరగల క్రూరుడు. ఆయన సంఘర్షణకు అధిపతి. పైగా తంపులుపెట్టడంలో అలవిమాలిన ఆనందాన్ని పొందగలిగినవాడు. కలహాభోజనుడు. కలహం కలహానికి దారితీస్తూనే వుంటుంది. పర్షియా రాజు సైరస్సు మెసొపొటేమియా సామ్రాజ్యాన్ని జయించి నప్పుడు తాను మర్డూక్ అనుగ్రహానికి ప్రత్యేకంగా పాత్రుడైన అదృష్టవంతుడనని ప్రకటించుకున్నాడు. నిజానికి సైరస్సు మెసొపొటేమియా రాజులందరికంటె విశేషమైన దయా దాక్షిణ్యాలుకలవాడు. విజేతగా ఆయన ప్రజలపై క్రౌర్యానికి ఎన్నడూ పూనుకోలేదు. మెసొపొటేమియా రాజులకు తెరవెనుక సలహాదారులుగావున్న మతగురువులపై వున్న కోపంతో ప్రజలు తిరుగుబాటుచేసి, నగరద్వారాలను పర్షియా దేశస్థులకు అనుకూలంగా తెరచివేశారు. పర్షియా సైనికులు సుశిక్షితులు, నాయకుని అజ్ఞనుజవదాటనివారు. విజేతలుగా నగరంలో ప్రవేశిస్తున్నప్పటికీ ఒక పూచికపుల్లనైనా ముట్టుకొనలేదు. ఎలాంటి హింసాకాండకు పూనుకొనలేదు. ఆ తరువాత తాను ఎత్తించిన జయస్తంభంపై ఇలా వ్రాయించాడు: "మర్డూక్ తనకు బాగానచ్చిన ధర్మప్రభువును ఎంచుకొని, తాను ముందుండి కేలూని నడిపించాడు." నిజమే, యిందులో అతిశయోక్తికాని, ఆత్మస్తుతికాని ఆవంతైనా లేదు. యింతవరకు జరిగిన అనేక అంతఃకలహాలలో విజేతలైనవారు

పెక్కు మెసొపొటేమియా నగరాలను ముఖ్యంగా యుద్ధంలో ఓడిపోయినవారి నగరాలను ఏవిధంగా నామరూపాలు లేకుండా నాశనంచేసివేశారో ప్రజలందరికీ ప్రత్యక్షంగా తెలుసు. భౌతికంగా కలిగిన అపజయంమాట అలావుంచండి. అంతకంటె గట్టిదెబ్బ వారి మనసులకు తగిలింది. తాము అజేయులమని విశ్వసించి అమేయమైన భక్తితో ఆత్మార్పణకు సైతం వెనుదీయకుండా ఆరాధించిన దేవతలందరూ అక్కరకు ఆదుకోకపోవడమే కాకుండా తమ కళ్ళఎదుటనే వారి ఆలయాలన్నీ విజేతల చేతులలోపడి నేలమట్టమై పోవడం వారికి ఎంతో బాధ కలిగించింది. గతకాలంలో తాము యిలాంటి యుద్ధాలు సాగించి విజయాలు సాధించినప్పుడుగాని, విజేతలుగా తాము ఓడిపోయినవారి మహానగరాలను కొల్లగొట్టి నేలమట్టం చేసినప్పుడుగాని, తాముచేస్తున్న పని తప్పేమో అన్న పాపచింతన వారికి కలగనేలేదు. పైగా తాము గతంలో చేసుకొన్న దుష్కృత్యాల దుష్ఫలితమే ఇప్పటి ఈ దుర్దశలని తమ్ము తాము ఓదార్చుకోవడానికికూడ అప్పట్లో వారికి అవకాశం లేకపోయింది. చరిత్రను ఒక ప్రత్యేకమైన నైతికదృష్టితో పరిశీలించకపోవడంవల్ల కలిగే ఆవేదన అంతా కొన్నికొన్ని సందర్భాలలో కొట్టవచ్చినట్టు కనబడుతుంది. ముఖ్యంగా ఎలం సైనికులు నిర్దాక్షిణ్యంగా నాశనం చేసినప్పుడు తాముచేసిన పాపఫలమిదియని విచారించే సందర్భంలో యీ భావం బాగా వ్యక్తమైంది.

నామరూప రహితముగా
నా నగరము నశియించెను.

నిష్ఠైతుక ఘాతుకతన్
నిర్మూలితమై పోయెను.

లక్షసార్లు జయించిన
రక్షా మంత్రాక్షరములు
వృథలై వ్యథలే మిగిలెను
వ్యథలే కథలై మిగిలెను.

చెలరేగిన అతిదారుణ
ప్రళయ వర్ష వాహినిలో
ఏమైతివి నా పురమా ?
ఎందేగితి వో పురమా ?

దేవతలందరూ అకారణంగా, క్రూరంగా లేనిపోని కసి మనస్సులో పెట్టుకొని నగరాన్ని వదలిపెట్టి పారిపోవడం చేతనే ఉర్ పట్టణానికి ఈ దుర్దశ పట్టింది. కాని, బాబిలోనియా రాజుల పాలనలో మూకవుమ్మడిగా ప్రవాసశిక్ష అనుభవించిన హీబ్రూల మతప్రవక్త మహూమ్ ఈ నగరం నాశనమైపోయే సమయంలో తన భావాల్ని ఈ విధంగా వ్యక్తం చేశాడు:

రక్తసిక్తము, పాప
సిక్తమైన పురమ్ము
శాశ్వతంబుగ దుఃఖ
జలధి మగ్నంబగును !

ఆ మహా సామ్రాజ్యం పతనమై తన కైవసం కావడం దైవేచ్ఛ ప్రకారమే జరిగిందని నైరస్సు నమ్మాడు.

దేవుడంటే నైరస్యుకుగల అభిప్రాయాలు నాగకర మైనవి. అయితే దైవభావనకు, సాంఘిక న్యాయసూత్రా లకు అత్యంత సన్నిహిత సంబంధంకలదని విశ్వసించిన మెసొపొటేమియా రాజులు కొందరు లేకపోలేదు. వీరిలో అగ్రగణ్యుడు క్రీస్తుపూర్వం 2900 ప్రాంతంలో లగాష్‌ను పరిపాలించిన ఊరుకాజినా; తాను తన ప్రజలకు స్వేచ్ఛను ప్రసాదించానని ఆయన ఒక సందర్భంలో చెప్పుకున్నాడు. ఆయన తన హయాంలో అమలుజరిపిన సంస్కరణలుచూస్తే ఆ మాటనిజమే ననిపిస్తుంది. భూస్వామిక వ్యవస్థలో యజ మాని తన సరసనేఉన్న నిరుపేదను నిర్బంధించి, ఏదో నామ మాత్రమైన వెలకు అతని ఆస్తిపాస్తులు అన్నింటినీ కాజేసినా అడిగేదిక్కు ఉండదు. ఆ పరిస్థితులలో 'దుర్బలస్య బలం రాజా' అన్న సూక్తిని ధైర్యంగా అమలు జరిపినమహారాజు ఈయన. తన యింట అందమైన పశువు పుట్టినప్పుడు యజ మాని దానిని కొనదలచినట్టు అభిప్రాయాన్ని వ్యక్తంచేసినా, లేక తన ఇరుగు పొరుగునఉన్న శ్రీమంతుడు, ఆ ఇంటిని కొన దలచినట్లు సూచించినప్పుడు తా నమ్మనని చెప్పడానికి, ఒక వేళ అమ్మదలచినట్లయితే సరసమైన ధరకు వెండినాణెము లలో వెల చెల్లించవలసిందని నిర్భయంగా చెప్పడానికి ఈ నిరుపేదలకు హక్కుఉన్నదని రాజశాసనం చేశాడు. పేదలదగ్గరనుంచి మతాధికారులు అయినదానికి కానిదానికి ఏదో వంకచెప్పి వీరి కష్టార్జితంఅంతా దండుకుపోతున్నారని గమనించి, ఆ దురాచారాన్ని అరికట్టడానికి అవసరమైన అన్నిచర్యలు తీసుకున్నాడు. పేదల తోటలలో, దొడ్లలో

ప్రవేశించి మతాధికారులు చెల్లునరకి వేయరాదని, ఫల పుష్పాలు తీసుకొని పోరాదని ఆజ్ఞాపించి కట్టుదిట్టంగా అమలు జరిపాడు. శ్రాద్ధవిధులకు మతాధికారులు విపరీతపు మొత్తాలు వసూలు చేయకుండా తగు చర్యలు తీసుకున్నాడు. అదివరకు వారు పుచ్చుకుంటున్న మొత్తంలో అయిదో వంతుకి తగ్గించివేశాడు. ప్రభుత్వోద్యోగులకు, శ్రీమంతులకు, మతాధికారులకు మధ్య గూడుపుఠాణీ ఏర్పాటులు ఉన్న వన్న సంగతిని ఆయన గమనించి వారి ఆజ్ఞలు సాగిరాకుండా నిషేధించాడు. దేవాలయగోష్ఠంలో ఉండే ఎద్దులతో ప్రభుత్వోద్యోగులు పొలాలు దున్నించుకుంటున్నారని, ఆలయపు మాన్యాలలో పండిన పంటనంతటిని పూజారులు, ప్రభుత్వోద్యోగులు దేవుని నోరుకట్టి తమలో తాము పంచుకోవడాన్ని కూడ ఆయన నిషేధించాడు. న్యాయాధిపతులుగా వ్యవహరించే పూజారివర్గం లంచాలకు మరిగి, ధనవంతుల తరఫున పక్షపాత బుద్ధితో తీర్పులు చెబుతున్నారని గ్రహించి, న్యాయవ్యవస్థలో ఇలాంటి అన్యాయానికి అవకాశం లేకుండా చేశాడు. సర్వవిధాలా సమర్థుడైన ఈ మహారాజు చేసిన పనులు, అమలు జరిపిన సంస్కరణలు సర్వదా, సర్వదా ప్రశంసనీయాలు. "ఇదివరకేమో మా రాజ్యంలో బానిసత్వం బాగా వ్యాప్తిలో ఉండేది. ఇప్పుడేమో స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు నిలయంగా ఉంది" అని ఈయన ఒక సందర్భంలో చెప్పిన మాట అక్షరాలా నిజం.

ఈయన తరువాత 300 సంవత్సరాలకు మెసొపొటేమియా పరిపాలించిన మరొక రాజర్షి గూడియా. ఈయన

తిరిగి భూతలస్వర్గంగా మార్చివేశాడని ప్రజలందరూ అత్యంతమైన భక్తిశ్రద్ధలతో ఆరాధించారు.

ఆ ప్రాచీనకాలంలో ప్రజల ప్రవర్తనను, నడవడిని వివరిస్తూ హామూరబీ ఒక ధర్మశాస్త్రాన్ని రచించాడు. ఈయన క్రీస్తుపూర్వం 2123 నుంచి 2181 వరకు బాబిలోనియాను పరిపాలించిన మహారాజు. ధర్మమే దైవమని, దేవుని ఆజ్ఞలే ప్రభుత్వ శాసనాలని, దేవుని ప్రతినిధిగా రాజు పరిపాలన చేస్తాడని, మానవసేవే మాధవసేవని, ఈ ధర్మశాస్త్ర గ్రంథానికి వ్రాసిన అవతారికలో ఈయన స్పష్టంగా వివరించాడు. "అనూ బెల్ అనే దేవతలు ఇద్దరు. నన్ను పిలచి, "దైవభక్తుడవైన హామూరబీ మహారాజా! ప్రపంచంలో దుష్టులను, దుష్టత్వాన్ని మట్టుపెట్టి, దేశమంతటా న్యాయధర్మాలను నెలకొల్పవలసిందని, బలవంతులు దుర్బలులను పీడించకుండా, హింసించకుండా కాపాడవలసిందని, దేశాన్ని నాగరకమొనర్చి ఇతోధికంగా ప్రజల శ్రేయస్సుకోసం కృషిచేయవలసిందని" నన్నాదేశించారు. నన్ను బెల్ రాజ్య పాలకుడుగా సంబోధించి ఆదేశించారు. నేను దేశాన్ని సంపన్న మొనరించి, ప్రజలందరికీ పుష్కలంగా నీరు అందేటట్టు చేశాను. అక్కరకు ఆదుకొని, ప్రజలందరికీ యథాశక్తి తోడుపడ్డాను. నేను ప్రజాపాలకుణ్ణి, ప్రజాసేవకుణ్ణి. నా చర్యలు దేవతలని ఎంతో సంతోషపెట్టే ఆధునిక శాసనాలదృష్ట్యా ఈ ధర్మశాస్త్రం పూర్తిగా లోపభూయిష్టమైనదని అనిపించినా, న్యాయశాసనానికి ధనిక నిర్ధనిక భేదం లేకుండా అందరూ సమానంగా బద్ధులు

కావాలని నిరూపించినది తొలిధర్మానుశాసనం. ఆయన ఇంకా ఇలా వ్రాశాడు: "ఏదైనా వ్యాజ్యంలో న్యాయం లభించనివారు నా చిత్రాన్నిచూసి ధర్మానుశాలియైన ధర్మ ప్రభువుగా భావించాలి. నా శాసనాన్ని చదివి నేను చెప్పిన సుభాషితాలను అర్థంచేసుకోవాలి. ఈ ధర్మశాస్త్రం న్యాయమైన పరిష్కార సాధన కృషిలో అతనికి మార్గదర్శక మౌగాక! దీనిని చదివి తన హక్కులను గుర్తెరిగి, సంతోష పడి, కృతజ్ఞతాబద్ధుడై 'హమూరబీ ధర్మప్రభువు తన ప్రజలకు కన్నతండ్రి వంటివాడు. దేశంలో విశుద్ధమైన, సమర్థమైన ప్రభుత్వాన్ని నెలకొల్పాడ'ని భావించుగాక." సాంఘిక న్యాయానికి సంబంధించిన సర్వసూత్రాలు దైవదత్తమైన న్యాయసూత్రాలకు తుల్యమైనవే అనేభావం ఆనాటి నాగరకులు అందరిలో కలదని చెప్పడానికి సాక్ష్యంగా పనికివచ్చే శాసనం పలక ఒకటి అషూర్ బనివాల్ గ్రంథాలయంలో దొరికింది. "రాజేకనుక న్యాయాన్నితప్పి చరించినట్లయితే ప్రజలందరూ నాశనమైపోతారు. రాజ్యాధికారం నమసిపోతుంది. దేశంలో అమలులోనున్న శాసనాలు అన్నింటినీ శిరసావహించి పాటించనట్లయితే విధాత అయిన ఇయా ఈయన విధినిమార్చి ఒక మూలకు యీడ్చివేస్తాడు."

ఇంతవరకు మనం మెసొపొటేమియా పౌరజీవితాన్ని గురించి తెలుసుకున్నాం. ఇకముందు మానవజీవితాన్ని గురించి, జీవితపు లోతుపాతులను గురించి, కష్టసుఖాలను గురించి, మానవ జీవితపు పరమధ్యేయాన్ని గురించి ఆనాటి వారి భావాలు ఎలా వుండేవో పరిశీలించుదాం. సుమేరియా

ప్రజలకు చరిత్ర అంటే ఏమిటో, దాని లక్ష్య లక్షణాలు ఏమిటో లీలగా తెలుసు. ఒక గీతానికి ఇతివృత్తం తొలి మానవుని జీవితవిధానం.

తొలిసారిగా మానవోదయం అయినప్పుడు తినడానికి రొట్టెలూ లేవు, ధరించడానికి దుస్తులూ లేవు. వారు చతుష్పాత్తులవలె చేతులు, కాళ్ళతో పాకి వెళ్ళేవారు. గొర్రెలవలె మూతులతో పీకి ఆకులలములు తినేవారు. మురికి నీరు త్రాగేవారు. ఈ విధంగా తొలి మానవుల అనాగరక జీవితంతో ఎంతో నాగరకమైన తమ జీవిత విధానాలను పోల్చి చూసుకొని మానవ నాగరకత ఎంతగా అభివృద్ధి చెందిందో రేఖా మాత్రంగా తెలుసుకోగలిగారు. కాని మానవుడు ఎన్నో గండాలను గడవగలిగాడుగాని మృత్యు గండాన్ని మాత్రం తప్పించుకో లేకున్నాడని వారు తెలుసుకున్నారు. "యాంటిగాన్" అన్న గేయంతో గ్రీకు వేదాంతి సోఫకిల్స్ సైతం యిదే భావాన్ని వెల్లడించాడు. అమరత్వం ఒక్క దేవతలకే దక్కిందనీ, అందుచేత సుఖ, విలాసమయ జీవితాన్ని గడిపేటప్పుడు యితర సమస్యలను గురించి ఆలోచించి మనసు పాడుచేసుకోవలదని సచితు గిల్గమేష్‌కు ఒక సందర్భంలో సలహా యిస్తాడు. కాని మెసొపొటేమియనులు మాత్రం బీదసాదలపట్ల కనికరం కలిగి ప్రవర్తించడం అవసరమనే సంగతిని గుర్తించారు. ఉత్తమ జీవిత విధానపు ప్రభావం వీరిపై చాలా వుంది. తమ జీవితంలో హృదయ పవిత్రతకు, ఆత్మనిగ్రహానికి, దైవభక్తికి ప్రత్యేక ప్రాధాన్యమిచ్చారు.

ఉత్తమ జీవిత విధానాలను గురించి వీరి జిజ్ఞాస మెచ్చు కొనదగింది. కాని జీవితాన్ని ఎదుర్కొనే బహుళ జటిల సమస్యలకు వారికి సరియైన సమాధానం లభించనేలేదు. నాటికీ నేటికీ అవి సమస్యలుగానే నిలిచిపోయాయి. సాంఘిక న్యాయం ప్రాతిపదికగా తాను ప్రవచించిన ధర్మానుశాసనం వల్ల స్వర్గ మర్త్యలోకాలవలె సుస్థిరమైన ధర్మరాజ్యం ఏర్పడగలదని హమూరబీ ఆశించాడు. కాని వన భూమి పుట్టిన తరువాత 'సుస్థిర' సామ్రాజ్యమంటూ ఒక్కటికూడా ఏనాడూ ఏర్పడలేదు. ఉరు కాజినా విషయమై తీసుకుందాం. ఆయన ధర్మప్రభువని, దైవసమానుడని, సాక్షాత్తు దేవుడని ప్రజలు పొగిడారుకదా. అలాంటివాడికి ఎలాంటి గతి పట్టిందో చూడండి. లోగాల్ జగ్గాసి అనే మరొకరాజు తన సేనలతో దండెత్తివచ్చి నగరాన్ని ధ్వంసంచేసి ఉరుకాజినాను పదభ్రష్టుణ్ణి చేశాడు. అయితె మొదటిసార్గన్ రాజుయీ జిగ్గాసీని ఓడించి, బందీగా పట్టుకొని, సంకెళ్ళువేసి నిప్పూర్ కు తీసుకువచ్చాడనుకోండి. అది వేరే సంగతి. ఏదో అవసరార్థం నీతినీ, న్యాయాన్ని తప్పని, సరిగా పాటించడంవల్ల తాత్కాలికమైన సత్ఫలితాలు కలుగుతాయనేది నిర్వివాదమైన విషయం. కాని అందువల్ల చివరికి పోను పోను వాటి అసలు విలువలు బయటపడటం తథ్యం. ధర్మసమ్మతమైన ఉత్తమ జీవితాన్ని గడిపినప్పటికీ ఇబ్బందుల పాలవడం విధి వైపరీత్యంగా వారు భావించారన్నసంగతి మనకు పెక్కుగీతాలలో వ్యక్తమవుతుంది. ధర్మబద్ధమైన జీవితాన్ని గడుపుతూ కడగండ్లపాలైన వారి జీవిత గాథలను ఇతివృత్తంగా

సేకరించి అనేకమంది కవులు కమనీయమైన కవితలను అల్లారు.

బాల్టా - అత్రువా ఒక మెసొపొటేమియా మహాకవి. మిగతా అందరికన్న మిన్నగా తాను భక్తిమయ పవిత్ర జీవితాన్ని గడిపాననీ అయినప్పటికీ దెబ్బమీద దెబ్బగా తాను కష్టపరంపరలలో చిక్కుకోవలసి వచ్చిందనీ ఒక గీతంలో కన్నీరు మున్నీరుగా విలపించాడు. తల్లితండ్రులు మరణించారు. ఆస్తి అంతా పోయింది. ఏకొంచెమో మిగిలివుంటే బందిపోటు దొంగలు దోచుకుపోయారు. ఇంతకంటే వేరే దౌర్భాగ్యం ఏముంటుంది? టాబి-ఉటుల్-ఎన్‌విత్ అనే ఆయన నిప్పూర్‌ను పరిపాలించిన రాజుల కోవకు చెందిన వాడు. ఈయనకూ యిలాంటి దురదృష్టమే కలిగింది. ఆయన జీవితమంతా మాఘ స్నానాలతోను, ఏకాదశి వ్రతాలతోను గడిచిపోయింది. తాను స్వయంగా మహాభక్తుడు. తన ప్రజలందరూ కూడా ముప్పొద్దులూ దైవ ప్రార్థనలు చేయాలని శాసించడమే కాకుండా, దేవతలకు నివేదనలిచ్చి సంతృప్తి పరిచేవాడు. అలాంటి మహాభక్తుడికి ముసలితనంలో తీరని వ్యాధి పట్టుకొంది. ఈయనపై రచించిన ఒక పద్యంలో కలి మహారాజు బాధను కనికరం కలిగేటట్లు వర్ణించాడు. ఫ్రెంచి మహాకవి బోదిలేర్ రచనలలో బాధల వర్ణన హృదయాన్ని ఏ విధంగా ద్రవీభూతం చేస్తుందో ఇదికూడా చదువరుల కన్నులను ఆ విధంగా చెమరింపచేస్తుంది.

ఆ వేదనల వలలు
ఆవరించెను నన్ను

కనులు తెరతునుగాని
కన లేను కన లేను

వీను లొగ్గుదు గాని
విన లేను విన లేను
వ్యాధి బాధాగ్రస్త
మాయె నా దేహమ్ము

మృత్యుకాళిమ నా శ
రీర మెల్లెడ తోచు
మృత్యువే దినదినము
మృగయుడై వెంటాడు

వికలము లయ్యె నా
వివిధేంద్రియము లయ్యొ!
మలమూత్ర దుర్గంధ
మాలిన్యమందు నే

పశువువలె పొరలాడి
పవళింతు రేయెల్ల
నిట్టూర్పులే పవలు
బిట్టేడ్పులే రేయి!

వలవంతలన్ గడచు
నెలలు, వర్షము లెన్నొ.
కాడు రమ్మని పిలుచు
కీడు పొమ్మని యనును!

జీవచ్ఛవమ్మునై
జీవించియుంటి; నను
జనులెల్ల మృతునిగా
జమకట్టినారు; నే
భరియింప నిక మృత్యు
పరిరంభ బంధమ్ము.

గురు శిష్య సంవాదరూపంలో నడిచిన పద్యం ఇంకొకటి ఉంది. దీనిలో సంశయాత్ముని పేరు గుబర్టూ. ఇందులో గురువు జ్ఞాన వయోవృద్ధుడు. ప్రతిచోటా ప్రపంచంలో "ఆదర్శానికి దే పై చేయి అవుతున్నందుకు" గురువు తన విచారాన్ని వ్యక్తంచేస్తాడు. దుర్మార్గాన్ని తీవ్రంగా ఖండిస్తాడు. "హత్యలు చేయడంలో మొనగాడైన హంతకుడి చర్యలనే మానవులందరూ మెచ్చుకుంటారు. పేదలను దోచుకుని విపరీతంగా నేరాలను చేయడానికి జంకని నేరస్థుణ్ణి విజేతగా మెచ్చుకుని అధికారం అంతా అలాంటి వాడికే కట్టబెట్టుతారు. పేదల కడుపుకొట్టి నోటిదగ్గరి కూడును ధనికుడు కొల్లగొట్టుతుంటే చూస్తూ ఊరుకుంటారు. దుర్బలులను నాశనం చేయడంలో నోరున్నవారి ప్రక్కనచేరి దుర్మార్గులను బలపరుస్తూ ఉంటారు." ఈ కవి లోకంపోకడ బాగా తెలిసినవా డనడంలో సందేహం లేదు.

అయితే జీవిత సమస్యలకు వీ రిచ్చిన సమాధానమేమిటి ? నాటినుంచి నేటివరకు ప్రపంచంలో వివిధదశలలో, వివిధ దేశాలలో పుట్టి పెరిగిన మేధావులు రకరకాల సమస్యలకు రకరకాల పరిష్కారమార్గాలు సూచించారు. వీరిలో

ఏ ఒక్కరికీ ఏకాభిప్రాయం లేదు. అలాగే మెసొపొటేమియా మేధావుల సమాధానాలుకూడా వివిధంగా ఉన్నాయి. సుజనులు కడగండ్లపాలు కావడమేమిటి? దుర్మార్గులు పెచ్చుపెరిగి సుఖంగా కాలం గడపగలగడమేమిటి? ఏమిటీ వైపరీత్యం? ఇది మానవ మస్తిష్కపు లోతులకు అందని విధివిలాసం అని అంగీకరించక తప్పదు. నిష్ఠురధర్మ దీక్షాబద్ధమైనప్పటికీ అవసాన సమయంలో ఆపదల పాలైన నిప్పూర్ పాలకుడు ఇలాగే అనుకుని సంతృప్తిపడ్డాడు :

స్వర్గమండలి దేవ
వర్గాల మార్గాలు
తెలియజాలెడు నరుడు
ఇలలోన కనరాడు !

దేవదేవుని గాథ
దివ్యలీలల గూడ
నెరుగజాలెడు నరుడు
ఎందు వెదికిన లేడు !

అయితే చివరకు ఏదో ఒక దశలో పరస్పర విరుద్ధంగా కనిపించే ఈ సమస్యలన్నీ పరిష్కారమై పోతాయనే ఆయన విశ్వాసం. ముఖ్యంగా అవసాన సమయంలోనో, పరలోకంలోనో ఇవి తప్పక పరిష్కారమై పోతాయని ఆయన నమ్మాడు.

ఎడతెరపిలేక ప్రవ
హించు నా కన్నీరు

పన్నీరుగా మారు
నెన్నడో నిది నిజము !

లోక రక్షకులైన
నాక వాసులు నన్ను
కరుణించు శుభదిన
మ్మొరుదెంచు నిది నిజము !

కాని గుబ్రియా ఆలోచనలు అతి తీవ్రమైనవి. భగవంతుడు అసలు లేకుండానైనా ఉండాలి. ఒక వేళ ఉన్నట్లయితే మానవుల కష్టాలను గురించి పట్టించుకోకుండానైనా ఉండాలి. "నీగుండె ఎంత మూలిగితేనేమి ? ఎక్కడో అంబని స్వర్గంలో ఉండే భగవానునిగుండె కరుగుతుందనా నీ ఆశ ? వెర్రిమాట" అంటాడు. "ఎల్లప్పుడూ ధనవంతులనూ, బలవంతులనూ ఆశ్రయించుకుని వారి మెరమెచ్చులకు లోబడిఉండే దేవుడు వద్దు. ఆ దేవుని ప్రతినిధులు వద్దు. మనకు వద్దుబాబూ" అంటాడు.

అసత్యాల విష సుమాల
పర్చింతురు దేవతలను
ధనవంతునికొరకు కారా
ధనకార్యము నెరవేర్తురు.

చోరునివలె ధనహీనుని
క్రూరముగా హింసింతురు.
దీప మూది ఆర్పినట్లు
పాప మతని ధ్వంసింతురు.

కొట్టుకుపోతూ ఉంటారు. కలిమిలేములు చక్రనేమి క్రమంలో చంచలంగా ఉంటాయని, ఏక్షణంలో ఎలాంటి మార్పు వస్తుందో ఎవ్వరూ చెప్పలేరని నిప్పూర్ రాజు ఒక పద్యంలో బోధించాడు.

నిన్న నతడు సజీవుడే,
నే డాతడు మృతుడు !
ఇంతలోన నాడి పాడి
అంతలోన నేడ్చెను.
నిముసములో రుజతో, మరు
నిముసములో సమసెను.

నడి సముద్రంలో పెను తుపాను మధ్య చిక్కిన నౌక వలె జీవిత సమస్యలలోపడి కొట్టుమిట్టాడి పోకుండా ధీర హృదయులుమాత్రమే నిశ్చలంగా నిలవగలుగుతారు. నిజమే. కాని అందరికీ ఆ ధీరత్వమెక్కడిది ?

నరుల తలపులు మారుచుండును
దినము కొక రీతిన్.

తినుటకేమియు దొరకనప్పుడు
దిగులు పడియెదరు.
కడుపునిండగ, దేవతలవలె
పొంగిపోయెదరు;

స్వర్గమే తమ జన్మహక్కని
ఎదరు చుండెదరు.

కాని దుఃఖము కలుగు వేళల
తమకు నరకము తప్పదనుకొని
తల్లడిల్లెదరు.

ధనిక నిర్ధనిక బేధం లేకుండా అందరూ మరణించవలసిన వారే. మృత్యువుకు పక్షపాతం లేదు. ఎంత బలశాలిఅయినా సరే - ఎంత అందగాడైనా సరే చివరకు అసువులుబాసి పోలి పోయి మన వైతరణివంటి నదిని దాటితీరవలసిందే. కనుక అవసానసమయంలోనైనా మన జీవితం సార్థకంగా గడిచిందనే సంతృప్తి కలగాలంటే యావజ్జీవితమూ ప్రతివారూ ఒక మహత్తర లక్ష్యసాధనకు కృషిచేయవలసే ఉంది. ధనాన్నీ, ధనవంతులనూ ఆరాధించడం వట్టి అవివేకమని నిష్పూర్ మహారాజు ఎలుగెత్తిచాటాడు. వివేకానికి ఇది పరాకాష్ఠ. "వివేకాన్ని కలిగి ఉండడమే కష్టం. దాన్ని అర్థం చేసుకోవడం మరీ కష్టం. అలాంటప్పుడు అల్పమానవులకు దాని అవధులు ఎక్కడ అందుతాయి?" అంటాడు గుబ్రయా. అయినప్పటికీ వివేకవంతమైన జీవితాన్ని గడప దలచుకోవడమే మానవుడు పాటించదగిన ఉత్తమాదర్శం.

# ఉపసంహారం

అనేక వసంతాలను చూచిన మహావృక్షం అనేక శిశిరాలను సైతంచూచి ఉంటుందనడం నిర్వివాదం. ప్రతి వసంతానికి చిగురించిన కోమల పల్లవాలన్నీ శిశిరం వచ్చే వేళకు పండి, ఎండి రాలిపోతాయి. దాని నీడనువున్న నేల అంతా ఏటేటా రాలిపడే పండు ఎండుటాకుల పొరలతో నిండిపోతూ వుంటుంది. అలాగే మెసొపొటేమియా నాగరకత అంతా కాలగర్భంలో కలిసిపోయి అనేక దశాబ్దులుశతాబ్దులు సహస్రాబ్దులు గడచిపోయాయి. ఆ శిధిలావశేషాలపై అనేక పొరలు పేరుకుపోయి నామరూపాలు లేకుండా పూడిపోయాయి. అయినప్పటికీ నశ్వరమైన భౌతిక కాయాలను విసర్జించిన తర్వాత కూడా అమరలోక వాసులైన పూర్వులందరినీ మనకు శాశ్వత సన్నిహితులను చేయగలిగినది వారి మధురస్మృతి మాత్రమే.

మెసొపొటేమియా సంస్కృతీ ప్రభావం తరువాతి తరాలవారి మీదకూడ చాలా దూరం ప్రసరించింది. బాబిలోనియా దేవాలయ గోపురాలకు నకలుగానే ముస్లిముల మశీదుల గోపురాలు, మధ్యకాలపు ఐరోపియవాస్తు శిల్పంలో ప్రాధాన్యం వహించిన గంటగోపురాలు నిర్మితమయ్యాయి.

నేడు మనం పాటిస్తున్న కాలమానం అంతా – ముఖ్యంగా వారాలు, రోజులు, గంటలు,నిముషాలు అన్నీ బాబిలోనియా విజ్ఞానులు పెట్టినభిక్షే. ఈజిప్టు తొలిదశలో అవలంబించిన చిత్రలిపి సుమేరియావారిది. వీటి మాటకేమి ? అన్నింటికంటె ముఖ్యమైనది ఆనాటిప్రజల అనుభవాలు, వారు ఎదుర్కొన్న సమస్యలు, వాటికి వారు చెప్పుకున్న సమాధానాలు. వీట న్నింటినిబట్టి ఏదేశంలో, ఎప్పుడు పుట్టినప్పటికీ మానవులం దరు ఒక్కటే, వారి అనుభవాలన్నీ ఒక్కటే, వారందరిదీ ఒకే కోవ అన్న మహత్తర సత్యం నిరూపిత మవుతుంది.

పెక్కుదేశాలలో తరువాత తరువాత అమలులోకి వచ్చిన పెక్కు సామాజిక వ్యవస్థలన్నింటికీ ఆది మూలం మెసొపొటేమియా సమాజమే. మొదట్లో రాజు సర్వాధికారి అన్నారు. కాని కాలంతోబాటు రాజరికంలో మార్పులు వచ్చాయి. రాజుగారి సర్వాధికారాలు దైవనిర్ణయాలకు లోబ డినవేనన్న భావంకలిగింది. ఉరుకాజినా తాను రాజునన్న మాటే మరచిపోయినట్లు కనబడేటంతగాసామాన్య ప్రజలతో కలిసిపోయాడు. భూస్వాముల, మతాధిపతుల క్రౌర్యంనుంచి పేదలనుకాపాడడంకోసం కంకణంకట్టుకున్నట్టు 'దుర్బలస్యబలం రాజా' అన్నసూక్తికి నిదర్శనంగా రాజరికాన్ని నిర్వహించిన ఆదర్శ ప్రభువు ఆయన. మోజెస్ భగవద్వాణి విన్నట్టుగా హామూరబీ తన ధర్మానుశాసనాన్ని స్వయంగా షమాష్ దేవుడు చెప్పగా విని వ్రాసినట్టు వివరించే సుందర శిల్పాలు దొరికాయి. ధర్మానుశాసనాలన్నీ దైవదత్తాలన్న విశ్వాసం మధ్యకాలపు యూరోపుదేశా లన్నింటిలోను మనకు ప్రబ

లంగా కానవస్తుంది. ప్రజలలో సాంఘిక చైతన్యం వెల్లి విరిసింది. మానవుల దుర్మార్గపు పోకడలను విమర్శిస్తూ గుబ్రూ గురువుతో జరిపిన చర్చ, ఆమోస్, ఇసయ్యావంటి తరువాతి కాలపు ప్రవక్తల పద్ధతులకు నాంది వంటిది.

మెసొపొటేమియా సంప్రదాయాలు అనేకం మనకు క్రైస్తవమతంలో కానవస్తాయి. దాని ఆది భౌతికరూపంలో, దాని ఆధ్యాత్మిక చింతనలో వీటి ప్రభావం విశేషం. తామూజ్ మరణం, పుత్రవియోగ దుఃఖంతో కుమిలి పోతున్న తల్లిగా ఇష్‌లార్ విజ్ఞప్తి, చివరకు భగవానుడు కనికరించి పునర్జీవితుణ్ణి చేయడం అంతా క్రీస్తుగాథకు బీజ ప్రాయంగా ఉంది. మరణానంతరం జీవి పాతాళంలో ఉండే శోకాంధ లోకానికి పోతాడని విశ్వసించినప్పటికీ, మర్దూక్ మరణించిన వారికి తిరిగి జీవనప్రదానం చేయగలడని మరొక గ్రంథంలో ఉల్లేఖితమైంది. బాబిలోనియా దేవతలకు గొర్రె లను బలియిచ్చినప్పుడు క్రింది అర్థంకల మంత్రాన్ని పఠించే వారు: "మానవునికి బదులుగా ఈ గొర్రెను మీకు నివేద నగా సమర్పిస్తున్నాం. తన ప్రాణానికి బదులుగా గొర్రె ప్రాణాన్ని నీకు సమర్పిస్తున్నా." ఒక దానికి బదులుగా మరొక దానిని సమర్పించే సంప్రదాయం ముఖ్యంగా క్రైస్తవ మతంలోను, యూదుమతంలోను మనకు ప్రస్ఫుటంగా కనబడుతుంది. కాని, పైనపేర్కొన్న మంత్రంలో ఈ సంప్ర దాయానికి అంకురార్పణ జరిగినట్టుండడం అతి విచిత్రమైన సన్నివేశం. వీటన్నింటికి క్రైస్తవమతంలో ఎంతో ప్రాధాన్య

ముంది. అంతమాత్రాన వీటి ఆదిమూలాన్ని మాత్రం మనం విస్మరించరాదు.

ప్రపంచ శ్రేయస్సుకోసం తన రక్తాన్ని చిందించిన మహనీయుడైన క్రీస్తుతోపాటు తన సామ్రాజ్య దాహాన్ని సంతృప్తిపరచుకోవడంకోసం మానవరక్తవాహినులు పారించిన నెబుకడ్నెజర్‌ను గురించి ఏకకాలంలో ప్రస్తావించడం దేవతా దూషణకావచ్చు. కాని క్రీస్తు తనంతపాపి మరెవ్వరూ లేరు కనుక సమీపించరాదని ప్రకటించాడు కదా. అంతేకాదు. ఈ ఇద్దరికీమధ్య మరొక సామ్యంకూడా వుంది. "దేవా నీకేది ఉత్తమమని తోస్తే దానినే అనుగ్రహించు" అని నెబుకడ్నెజర్ భగవానుని ప్రార్థించాడు. అనగా సర్వశక్తిమంతుడైన, సర్వజ్ఞుడైన మహావ్యక్తి ఇచ్ఛకు లోబడడం వల్లనే మానవునకు మహత్వం సిద్ధించగలదన్న ఆధ్యాత్మికానుభూతిని ఆయన పొందగలిగాడన్న మాట. "దయామయుడైన ఓ తండ్రీ, ఈ ఘటాన్ని తొలగించడమే నీ అభీష్టమైతే ఆప్రకారం కానియ్యి. ఏమైనప్పటికీ నీ కోరికే - నాదికాదు - నెరవేరనీ" అని క్రీస్తు దుర్భరమైన శిలువనెక్కేముందు భగవానుని ప్రార్థించాడు. దైవానుశాసనం అనివార్యం, అనుల్లంఘనీయం అన్న మహత్తర సత్యం మనకు క్రీస్తు త్యాగంవల్ల బోధపడుతుంది. నిజంగా ఆ సమయంలో క్రీస్తు అన్యదుర్లభమైన మహోన్నతమైన ఆధ్యాత్మిక శిఖరాలకు చేరుకోగలిగాడనడానికి ప్రార్థనే నిదర్శనం. ఒక సత్యాన్ని గ్రహించగలగడం వేరు. దానికోసం ప్రాణాన్ని సైతం ఒడ్డగలగడం వేరు. అయినప్పటికీ తాను నమ్మిన సత్యం కోసం ఆత్మార్పణ సైతం

చేయగల త్యాగశీలాన్ని అలపర్చుకో గలగడానికి ముందు అసలు సత్యం ఏదో గ్రహించ గలగాలికదా. ఇంతకీ నెబుక డ్నెజర్‌ను, క్రీస్తును ఒకే గాటను కట్టివేయడం నా అభిమతం కాదు. నేను చెప్పదలచింది అనేక వేలసంవత్సరాల్రకితం నెబుకడ్నెజర్ యాదృచ్ఛికంగా కనుగొన్న సత్యంకోసం ఆత్మార్పణ చేయగల ఆధ్యాత్మిక పరిణతి రెండు వేల సంవత్స రాల క్రితం క్రీస్తుద్వారా వ్యక్తమయిందనే.

మెసొపొటేమియా పురాణాలలోని సృష్టిగాథ, జల ప్రళయపు కథ రెండూకూడా 'పాతనిబంధన గ్రంథం'లో ప్రత్యేకాధ్యాయా లయ్యాయి. ఐతే సృష్టిగాథ చాలాచేర్పులు మార్పులు కూర్పులుపొంది చాలా మారిపోయింది. చచ్చి బ్రతికిన దేవుడు తామూజ్ తరువాత చాలా చాలా దేశాలు జయించాడు. ఈయనే ఈజిప్టులో ఓసిరిస్ అయ్యాడు. ఫ్రైజియాలో అట్టిస్ అయ్యాడు. గ్రీసు, ఫోనీషి యాలలో అడోనిస్ అయ్యాడు. అసలు కథ ఒక్కటే. ప్రతి దేశంలోను స్థానికమైన కూర్పులు మార్పులు చేర్పులు చాలా చేరాయి. అందుచేత పరాయి పురాణమైనా ఎప్పటి కప్పుడు స్వంతపురాణంలాగే ఉంటుంది. వరాహంతో తామూజ్ చేసిన యుద్ధం లెబనాన్ పర్వతాలలో జరిగినట్లు ఫోనీషియన్ గ్రంథాలలో వర్ణితమైంది. ఫోనీషియాలో ఈయనపేరు అడోనిస్. ఆ దేశంలోని ముఖ్యమైన నదిపేరు కూడా ఇదే (దాన్ని ఇప్పుడు నాహర్ ఇబ్రకిం అని మార్చారు). వసంతకాలంలో కురిసిన వర్షాలకు కొట్టుకొని వచ్చిన కంకరమట్టికలిసి దీని నీటిరంగు ఎర్రగామారిపోయింది.

కాని అడోనిస్ నెత్తురు ఇందులో కలవడంవల్లనే ఈ ప్రవాహంఅంతా ఎర్ర పడిపోయిందని స్థానికుల విశ్వాసం.

సారగాన్ రాజు నదిలో కొట్టుకువచ్చాడన్న గాథ మోజెస్ గాథవంటిదే. ఏటానా ప్రయాణగాథ చాలదూరం ప్రయాణించి గ్రీసుకు చేరుకునేసరికి ఇకారస్ గాథగా మారి పోతుంది. ఈ ఇకారస్ కూడా కృతకంగా రెక్కలు కట్టుకొని చాలాఎత్తుకు ఎగిరిపోతాడు. కాని ఎండవేడికి కట్టుకున్న రెక్కలు మాడిపోగా సముద్రంలో పడిపోయి పరమపదం చేరుకుంటాడు. పాము, డేగ కథ నాటినుంచి నేటివరకు సంప్రదాయసిద్ధంగా రకరకాల మార్పులకు లోనవుతూనే ఉంది. జంతువులు పాత్రధారులుగా ఈసప్ చెప్పిన నీతికథల శైలిమాధుర్యం లోక ప్రసిద్ధం. పదిహేడవ శతాబ్దిలో ప్రసిద్ధ ఫ్రెంచి రచయిత లాఫాంటేన్ ఈ కట్టుకథల పద్ధతిలో జీవితపు లోతులను గురించి తన భావాలను సమర్థంగా వెల్లడి చేయగలిగాడు. జీవితాన్ని వ్యంగ్య ధోరణిలో విమర్శించడానికి తూర్బర్‌కు ఇది ఎంతో సాయపడింది.

ఇక గిల్‌గమేష్ ఇతిహాసం ఉంది. అమరత్వ సాధనకు అనుసరించవలసిన విధానాల అన్వేషణలో ఇది డాంటే రచనకు ఏమాత్రం తీసిపోదు. అయితే డాంటే మహాకవి రమ్యమైన శైలి మెసొపొటేమియా మహాకవి రచనలో మృగ్యమైనదంటే అది వేరే సంగతి. అయితే యూలిసిస్‌వలె గిల్గమేష్ కూడా బలవంతుడు, సాహసి, జ్ఞానపిపాసి. ఆయన జిజ్ఞాస మానవుని జిజ్ఞాస. అది మనందరి జిజ్ఞాస. మెసొపొ

టేమియా రచయితల ప్రభావం వారు సృష్టించిన సాహిత్య ప్రభావం, వారి సంస్కృతీ ప్రభావం తరువాతి తరాలవారి మీద చాలా దూరం ప్రసరించింది. ఆ ఆదిమకాలంలో మానవజీవితపు లోతులు స్పృశించడానికి వారు చేసిన ప్రయత్నాలు మనకు నిత్యోత్తేజకరమైనవి. కాలగర్భంలో కలిసిపోయిన మెసొపొటేమియా నాగరకత మానవలోకానికి అందించిన వెలుగు జిలుగులను రేఖామాత్రంగానైనా సాహితీ ప్రియంభావుకులైన తెలుగు వారికి తెలియ చెప్పాలనే తపనలో చేసిన ప్రయత్నం ఇది. మెసొపొటేమియా సాహిత్య సమాలోచన తరువాత విశ్వసాహిత్య దర్శనంలో మన రెండవ మజిలీ ఈజిప్టు.




ఆసియా మైనర్
సైప్రస్
మధ్యధరా సముద్రం
అంటియొక్
బిబ్లాస్
సిదోన్
దమాస్కస్
టయర్
ఏకర్
సమరియా
సిరియా ఎడారి
జెరూసలేం
గాజా
మృత సముద్రం
సినై
ఈజిప్టు
ఎర్ర సముద్రం
అరేబియా

